# విమానం కథ

## మొదటి విమానం కనిపెట్టిన రైట్ సోదరుల గాథ

*Editors :*

B. SAKUNTALA DEVI
SIVARAMAKRISHNA

---

**THE WRIGHT BROTHERS**

*Pioneers of American Aviation*

By QUENTIN REYNOLDS

*Translated in to Telugu*

By 'SAILENDRA'

And Published by
**DESI KAVITA MANDALI,**
**Vijayawada-2.**

With the kind Permition of
Random House. New york.

# విమానంకథ

మూలం :

క్వెంటిన్ రెనాల్డ్స్

అనువాదం :

'శైలేంద్ర'

★

దేశి కవితా మండలి
విజయవాడ-2

ముద్దుగా పిలుస్తారు) ముగ్గురు అలా వాళ్ళ అమ్మ వెంట పిక్నిక్‌కి వెళ్ళడం అంటే భలే సంబరపడతారు. సూసన్ వాళ్ళని అలా వనాలవేపు తీసుకుపోయి కులాసాగా ఒక రోజంతా అక్కడే వుండి భలే భలే కబుర్లు చెబుతుండేది. ఈ ప్రపంచంలో ఎన్ని పక్షులున్నాయో అన్నిటిపేర్లు ఆవిడకి తెలుసు. అసలు ఏదయినా పక్షికూత వింటే చాలు, అది ఫలానా పక్షి అని చిటికెలో చెప్పివేస్తుంది. కనపడని పక్షులన్నిటిపేర్లు పాపాయిలకి చెబుతూ ఉండేది. అంచేత విల్బర్, ఆర్విల్ కూడా పక్షులు కనపడితే చాలు, వాటిపేర్లు చెప్పివేసేవాళ్ళు.

వాళ్ళది డేటన్ అనే ఊరు. ఆ దగ్గరలోనే ఒక నది ప్రవహిస్తూ వుండుంది. ఒక్క సంగతి జ్ఞాపకం పెట్టుకోండి. విల్బర్‌ని 'విల్' అనీ, ఆర్విల్‌ను 'ఆర్వీ' అని వాళ్ళ అమ్మ-నాన్న పిలిచేవాళ్ళు. ఒకనాడు వాళ్ళు ఆ నది ఒడ్డున కూర్చున్నారు. విల్, ఆర్వీ ఇద్దరూ గాలాలువేసి చేపలు పడుతూ వున్నారు. ఎంచేతనోగాని ఆవేళ వాళ్ళ గాలాల్లో చేపలు అట్టే పడటంలేదు. ఆ అబ్బాయిలిద్దరూ అలానే చూస్తూ కూర్చున్నారు. ఇంతలోనే ఎక్కడినుంచి వచ్చిందో ఏమో ఒకపెద్ద పక్షి రివ్వున వచ్చి చటుక్కున ఒక చేపను ఎత్తుకుని ఆకాశంలోకి ఎగిరిపోయింది. విల్‌కి ఇది చూడగానే ఒక సందేహం కలిగింది.

4

'అమ్మా పక్షులు ఎలా ఎగురుతాయి ?' అని వాళ్ళ అమ్మను అడిగాడు.

'వాటికి రెక్కలుంటాయి బాబూ : చూడలేదూ అవి ఎగిరేటప్పుడు వాటి రెక్కలు ప్రక్కలకు ఆడుతూ ఉంటాయి. ఆ రెక్కలతోనే అవి గాలిలో ఎగురుతాయి. తెలిసిందా ?'

అంతటితో విల్‌కి తృప్తి కలగలేదు.

'అయితే అమ్మా, మరి ఆ పక్షి క్రిందకు వచ్చేటప్పుడు గాని, చేపను తన్నుకుని తిరిగి పైకి ఎగిరిపోయేటప్పుడుగాని దాని రెక్కలు ఆడించినట్టే లేదుగా ?'

'గాలి అటునుంచి యిటు, ఇటునుంచి అటు మాత్రమే కాదు. క్రిందికి-పైకి కూడా వీస్తూ వుంటుంది బాబూ. అంచేత గాలి పైకి వీచే సమయంలో అది పైకి ఎగిరి ఉంటుంది. అప్పుడు దానిని గాలి మోసుకుపోతుంది. రెక్కలేమో పక్షిని క్రింద పడకుండా నిలుపుతూ ఉంటాయి.'

'మనకూ రెక్కలు వుంటే మనం కూడా ఎగిరిపోవచ్చు, కాదమ్మా ?' విల్ అడిగాడు. ఈ ప్రశ్న వినగానే వాళ్ళ అమ్మకు నవ్వొచ్చింది.

'మరి దేవుడు మనకి రెక్కలు పెట్టలేదుగా ?' అన్నది.

'అయితే ఏం. మనమే రెక్కలు చేసుకోకూడదు ?' విల్ మళ్ళీ అడిగాడు.

'రావచ్చు. ఏమైనాయనా మనుషులు ఎగరటానికి పనికి వచ్చే రెక్కలు ఎవరూ చేసినట్టు ఇంతవరకు నేను వినలేదు' అన్నదావిడ ఏదో ఆలోచిస్తూ.

'ఉండమ్మా ఎప్పుడో ఒకసారి నేను తయారుచేస్తా చూడుకో' అన్నాడు విల్.

'నేనూ చేస్తాగా' అని అందుకొన్నాడు వాళ్ళ తమ్ముడు ఆర్వి కూడా.

'సరేలే ఇంకా కొంచెం పెద్దవాళ్ళయ్యాక అలానే చేద్దువుగానిలే' అన్నదామె.

అదే ఇంకెవరి అమ్మ అయినా అయితే 'వాళ్ళ మొగంలే' అనుకొనేవాళ్ళే. ఏదో పిల్లతనపు వాగుడు క్రింద లెక్కవేసే వాళ్ళే. సూసన్‌రైట్‌లో వున్న ప్రత్యేక కళ అదే. ఆవిడ అందరిలాగా 'చెప్పలేవోయ్ మహా, ఎవరయినా వింటే నవ్వుతారు' అనలేదు. చిన్నపిల్లలకూ ఆలోచనలు వుండవచ్చు. వాళ్ళ పసివాళ్ళయినంత మాత్రాన వాళ్ళ మాటలూ తోసివేయటానికి వీల్లేదని ఆమెకు తెలుసు. సూసన్ ఎప్పుడూ కూడా తన పిల్లల్ని యేమీ తెలియని పసికందులుగా చూచేదిగాదు. వాళ్లు చెప్పే ప్రతిమాటా శ్రద్ధగా వింటూ చేతనైనంతవరకు వాళ్ళకు తృప్తికలిగించే సమాధానాలు చెప్పటానికే ప్రయత్నించేది. అందుచేతనే ఆవిడ వెంట పిక్‌నిక్‌లకు వెళ్ళటమన్నా, ఆవిడవెంట వెళ్ళి చేపలు పట్టటమన్నా వాళ్ళకి భలే సరదాగా

6

ఉండేది. అందుకే వాళ్ళు ఎప్పుడూ వాళ్ళ అమ్మని ఎన్నో ప్రశ్నలు అడుగుతూ ఉండేవాళ్ళు. ఆవిడ కూడా విసుగు లేకుండా జాగ్రత్తగా వాళ్లకి జవాబులు చెబుతూ వుండేది.

వాళ్ళ నాన్నగారు కూడా అప్పుడప్పుడు ఇలానే ప్రశ్న లడుగుతూండేవాళ్ళే. కాని ఆయనది క్రీస్తుపాదిరి ఉద్యోగం. గావున ఎప్పుడూ వూళ్ళవెంట తిరుగుతూ ఉండేవారు. ఇంటివద్ద ఉండేవాడే గాదు.

'చలిగాలి వీస్తోందిబాబూ-అటు ఆకాశంవేపు చూడండి' అన్నది వాళ్ళ అమ్మ.

'ఆ, నేను చెబుతున్నాగా ఇంకా కొంచెంసేపు ఉంటే మంచు పడకపోదే చూడండి' విల్ అన్నాడు హుషారుగా, ఎగురుతూ.

'అవును బాబూ మంచు పడేలా వుంది. ఇక పోదాం పదండి. మళ్ళీ వసంతకాలం వస్తేనే మనం ఇలా పిక్‌నిక్‌లకి వచ్చేది' అన్నదావిడ.

వాళ్ళు ఇంటికి చేరుకున్నారో లేదో పెద్ద పెద్ద మంచు పొరలు జారటం మొదలు పెట్టింది, ఆ రాత్రి. ఆ మరునాటి పగలు అంతా అలా మంచు పడుతూనే ఉంది. ఆ యేడు అదే మొదటి మంచు తుపాను అని చెప్పవచ్చు.

మరునాటి వుదయం గాలి భోరున వీస్తోంది. ఇంట్లో నుంచి ఆ గాలిలో కట్టెల దొడ్లోకి వెళ్ళటం విల్‌కి ఎంతో కష్టం

అయింది. ఆ గాలిదెబ్బకు అతను క్రింద పడిపోబోయాడు కూడా. ఎలానో అతి కష్టంమీద దొడ్లోనుంచి హెయ్స్ క్రిందకు ఒక వాలెడు కట్టె పుల్లలు పుచ్చుకొని దొడ్డిగుమ్మంలోగుండా వంట యింట్లోకి వచ్చి ఆ గాలిని గురించి వాళ్ళ అమ్మతో చెప్పాడు.



'అలాంటప్పుడు ఏంచేయాలో తెలుసా? బాగా ముందుకు వంగి నడవాలి. అలా వంగితే భూమికి దగ్గరగా వుంటావు కదూ. నీకు అక్కడ తక్కువగాలి తగులుతుంది. కనుక కొంచెం తేలికగా ముందుకు నడవగలుగుతావు' అని ఆమె ఉపాయం చెప్పింది.

ఆవేళ సాయంత్రం పుల్ల కట్టెల దొడ్లోకి వెళ్ళాలిసి వచ్చినప్పుడు విల్ వాళ్ళ అమ్మ చెప్పినట్టే చేసి చూశాడు.

8

వాళ్ళ అమ్మ చెప్పినమాట నిజమే. దాను ముందుకు వంగి నడచినప్పుడు గాలి అంత జోరుగా ఉన్నట్టు అనిపించలేదు. విల్‌కి ఇదేదో విచిత్రంగా కనపడింది. ఇలా రెండు మూడు రోజులు గడిచాక గాలి తగ్గిపోయింది. వాళ్ళ దొడ్డి అంతా మంచుతో కప్పివేసేసింది. విల్, అల్ఫ్ ఇద్దరూ వాళ్ళ ఇంటికి దగ్గరలోనేవున్న బిగ్‌హిల్ అను కొండ గట్టుమీదకి పరుగెత్తారు. వాళ్ళ చెల్లాయి కేట్ కూడా వాళ్ళ వెనకాలే పరుగెత్తుకుపోయింది.

అక్కడ ఆల్ఫ్ తన బడిపిల్లలందరూ ఆడుకొంటూ ఉండటం చూచాడు. వాళ్ళందరూ స్లెడ్జిబళ్ళు పెట్టి ఆడుకొంటున్నారు. (స్లెడ్జిబండి అంటే మంచుగడ్డమీద జారుతూ పోయే బండి అన్నమాట) పిల్లలు స్లెడ్జిపెట్టి ఆడుకోటానికి ఈ గుట్ట బావుంటుంది. దీని ప్రక్కనుంచిపోయే రస్తాలేమీ లేవు. అంచేత అక్కడ పిల్లలు ఆడుకోటానికి భయండేది లేదు. ఇదంతా 1878 సంవత్సరంనాటి సంగతి. అందుకే ఆ రోజుల్లో కార్లు లేవు. గుర్రాలు లాక్కుపోయే స్లెడ్జిబళ్ళల్లో పెట్టువాళ్ళు ప్రయాణము చేసేవాళ్లు. ఆ గుర్రాల మెడల్లో గంటలు కట్టేవాళ్ళు. గుర్రాలు పరుగెత్తుతుంటే ఆ గంటలమోత మైలు దూరానికి వినపడుతుండేవి. ఆ చప్పుడును బట్టి బండి వస్తున్నట్టు నీకు తెలుస్తుంది. ఈ బళ్ళు శీతాకాలం (మంచు ఉండే రోజులు) లో మాత్రమే నడిచేవి.

చాలామంది పిల్లలకు ఎవరి స్లెడ్జి వాళ్ళకే ఉండేది. ఇప్పటిలాగా ఆ రోజుల్లో బళ్ళకు చక్రాలు ఉండేవికావు. జారటానికి వీలుగా రెండువేపులా రెండు సన్నటి కొయ్యలు అమర్చి ఉంటాయి. ఎవరూ స్లెడ్జి కొనుక్కొనే అలవాటు ఉండేదికాదు. ఎవరి నాన్న వాళ్ళకు ఆ బండి చేసిపెట్టేవాడు.

అప్పుడప్పుడు స్లెడ్జిలు ఉన్న పిల్లలు విల్, ఆర్పీ ఇద్దరిని కొంచెంసేపు వాళ్ళ స్లెడ్జిమీద యెక్కనిచ్చేవాళ్లు. ఎడ్వర్డు సైమను, చార్లీస్మిత్, జానీమారో, అల్ఫాన్సోస్టైన్ వాళ్ళ అందరికీ సొంత స్లెడ్జీలు వున్నాయి. వాళ్ళంతా పందెం వేసుకొని కొండ గట్టుమీదనుంచి క్రిందకు జారుతూవుంటే విల్, ఆర్పీ ఇద్దరూ దిక్కుమొగాలు వేసుకొని చూస్తూ నిలుచుండేవాళ్ళు. ఆవేళ మధ్యాహ్నం విల్, ఆర్పీ వాళ్ళ వెంట చెల్లాయి ముగ్గురు ఇంటికి వచ్చారు. వీళ్ళిద్దరూ ఇంటికి వచ్చినప్పటినుంచి ఏమీ మాట్లాడకుండా విచారించి వుండటంవల్ల అమ్మ గమనించింది. ఆవిడ చాలా తెలివైనది గదూ! వాళ్ళలా ఎందుకు ఉన్నారో ఇట్టే తెలుసుకోగలిగింది.

'నాన్న మాకు స్లెడ్జి చేసిపెట్టడేమమ్మా?' అని అడిగాడు.

'నాన్నగారికి తీరిక ఎక్కడుందిరా! మీరు చూడటం లేదూ? ఎప్పుడూ ఏదో ఒక ఊరు వెళ్ళాలిసిందే. ఇంటిదగ్గర ఉన్నప్పుడు మాత్రం వూరుకుంటున్నారా? అన్నది అమ్మ.

చర్చి పత్రికకి కథలు వ్రాయాలా ? క్రీస్తు మీద వచనంమీద ఉపన్యాసం వ్రాయాలా ? ఇంకా ఎన్ని పనులు? 'ఆఁ మనమే ఒక స్లైడ్జ్ తయారుచేసుకుంటే ?' అన్నదావిడ.

ఈ మాట వినగానే విర్‌కి నవ్వొచ్చింది.

'ఎక్కడయినా ఆడవాళ్ళు స్లైడ్జులు తయారుచేస్తారా ?'

'మీ కెందుకు-లా వుంచండి. మెడ్వర్దు స్లైడ్జ్‌కంటే మంచిది మనం చేసుకుందాం. ఆఁ. ఒక తెల్లకాగితమూ ఒక పెన్సిల్ ఇలా పట్టుకరండి.'

'ఇతేలే కాగితంతో స్లైడ్జ్ చేసిపెడతావా ఏమిటమ్మా ?' ఆల్బర్ట్ ఆశ్చర్యంగా అడిగాడు.

'మీ రెందుకు చూస్తూ ఉండండి' మళ్ళీ అన్నదావిడ.

# మొదట కాగితంమీద చేతనైతే....

విక్, ఆర్చీ వెళ్ళి వాళ్ళమ్మ చెప్పినట్టు ఒక కాగితం-పెన్సిలూ తీసుకొచ్చారు. ఆవిడ వాళ్ళ నాన్న వ్రాసుకొనే మేజాబల్లవద్దకు వెళ్ళి డ్రాయరులో వున్న రూళ్ళకర్ర తీసుకొని వచ్చి వంటయింట్లో భోజనాలు చేసే బల్లవద్ద కూర్చున్నది.

'మొదట యీ కాగితంమీద ఒక స్లెడ్జి బొమ్మ వేద్దాం. ఏం ?' అన్నదావిడ.

'స్లెడ్జిబొమ్మ ఏం జేసుకోను ?' ఆర్చీ అన్నాడు.

'అమ్మ చేసేది చూస్తుండరా' ఆర్చీని విక్ అన్నాడు.

ఆవిడ ఒక చేత్తో రూళ్ళకర్ర - మరొకచేత్తో పెన్సిలూ పట్టుకున్నది.

'ఎడ్వర్డు స్లెడ్జి లాంటిది కూడా కావాలమ్మా' ఆర్చీ మళ్ళీ అన్నాడు.

'ఆఁ సరేగాని మరి ఆ కొండ గట్టుమీదకువెళ్ళి ఎగిరి దిగుటకు ఎడ్వర్డు స్లెడ్జిలో యెంతమంది పిల్లలు యెక్కడానికి వీలయుంది ?' ఆవిడ అడిగింది.

'ఇద్దరు అమ్మా' విక్ చెప్పాడు.

'సరే. అయితే మనం అంతకంటే ఇంకా కొంచెం పెద్దది చేద్దాం. అప్పుడప్పుడు చెల్లాయిని కూడా ఎక్కించుకు వెళ్ళవచ్చు' అంటూ వాళ్ళ అమ్మ ఆ కాగితంమీద పెన్సిలుతో స్లెడ్జిబొమ్మ గీయటం మొదలు పెట్టింది. 'ఎడ్వర్డు స్లెడ్జి చాలా సార్లు నేనూ చూచాలే. అది నాలుగడుగుల పొడుగు వుంటుంది. మనది అయిదులడుగులు ఉండేట్టు పెడదాం. ఎడ్వర్డు స్లెడ్జి అడుగు ఎత్తుకు పైగా ఉంటుంది కదూ ?' అంటూ బొమ్మ గీసింది.

ఆర్విల్ దానివేపే చూస్తూ తల ఆడిస్తున్నాడు. ఆ బొమ్మ స్లెడ్జిలాగానే కనబడుతోంది. కాని వాళ్ళు కొండ గట్టువద్ద చూచిన ఆ పిల్లల స్లెడ్జీలలో ఏ ఒక్కదానిలాగా యిది లేదు.

'కొంచెం ఎత్తుకూడా లేకుండా చేసేవేమమ్మా ?' విల్ అడిగాడు.

వాళ్ళ అమ్మ నవ్వుతూ 'ఎడ్వర్డు స్లెడ్జికంటే వేగంగా పోయేది కావాలికదూ ? వాడి బండి అడుగుకు పైగా యెత్తు వుంటుంది. మనది అంతకంటే తగ్గించి పెట్టాం. అంటే భూమికి చాల దగ్గరగా ఉంటుందన్నమాట. అంచేత దీనికి వాళ్ళ బళ్ళకు తగిలేటంత యెదురుగాలి తగలదు. కనుక వాళ్ళకంటే మన స్లెడ్జి వేగంగా పోతుంది' అన్నది.

'ఎదురుగాలి ?' ఇదివరకెప్పుడూ విల్ ఈ మాట విన లేదు. ఇదొక కొత్త సంగతి. అంచేత విల్ ఏమీ తోచక తల్లి వేపు చూచాడు.

'క్రిందటివారం మంచు తుపాను జ్ఞాపకంలేదూ ? నీవు కట్టెల కొట్లోకి వెళ్ళబోయి గాలిదెబ్బకు పోలేక పోయావు కదూ ? అప్పుడు ముందుకు వంగి నడవమని చెప్పాను - మళ్ళీ వెళ్ళి వాటెడు కట్టెలు పట్టుకువచ్చి నవ్వుతూ 'అమ్మా అమ్మా నీవు చెప్పినట్టే వంగి గాలిక్రింద నడిచాను' అన్నావు మరచి పోయావా ? అంటే నీవు అలా వంగి నడిచినపుడు నేలకు సమీపంలో ఉంటావన్న మాట. అపుడు 'గాలిదెబ్బ' తక్కువగా ఉంటుంది. అంచేత మన స్లెడ్జికూడా ఎత్తు తగ్గిన కొద్దీ యెదురు తగిలే గాలిదెబ్బ కూడా తగ్గుతుంది గనుక బాగా వేగంగా పోగలుగుతుంది.

'ఎదురుగాలి........ఎదురుగాలి'

విల్ ఈ మాట తనలో తానే నాలుగు అయిదుసార్లు అనుకొన్నాడు. బహుశా 'విమానం' అనునది ఆ బుర్రలో ఆ క్షణంలోనే పుట్టిందేమో ! వేగానికి సంబంధించిన ఈ తొలి పాఠాన్ని ఆ అన్నా-తమ్ముడూ ఇద్దరూ జీవితంలో మరెప్పటికీ మరచిపోలేదు.

'అయితే ఈ సంగతులన్నీ నీకెలా తెలుసమ్మా ?' విల్ వాళ్ళ అమ్మని అడిగాడు.

'తల్లులకు తెలిసినవన్నీ వింటే ఇంకా ఆశ్చర్యపోతావు బాబూ !' అంటూ నవ్వి వూరుకుంది. అంతేగాని చిన్ననాడు తాను స్కూల్లో చదువుకొనే రోజుల్లో లెక్కలు తనకు ఎక్కు-

పగా ఇష్టమైన (అభిమాన) విషయమని వాళ్ళలో చెప్పలేను.
ఆవిడకు ఆ తెలివి సహజంగానే అబ్బింది. హైస్కూల్లో అంతే.
కాలేజీలో కూడా ఆవిడ ముఖ్యంగా చదువుకొన్నది - బీజగణి
తము, క్షేత్రగణితము. అంచేతనే ఆవిడకి 'గాలి రాపిడి' మొద
లైన విషయాలు బాగా తెలుసు.

కాగితంమీద బొమ్మ వేయటం పూర్తి అయింది. ఆ
కుర్రవాళ్ళిద్దరూ బల్లమీదకు వంగి ఆ బొమ్మవేపు చూచారు.
ఈ స్లెడ్జి ఎక్కువ స్లెడ్జికంటే తక్కువ వెడల్పుగానూ, ఎక్కువ
పొడుగుగాను ఉంటుంది. అసలు స్లెడ్జి కూడా అడుగుల వెడల్పు
ఉంది. దీని వెడల్పు దానికి సగంగా కనబడును.

'మన స్లెడ్జి బాగా వేగంగా పోవటానికని వెడల్పు
తగ్గించి పెట్టావన్నమాట. కాదమ్మా! ఎంత తక్కువ వెడ
ల్పుగా వుంటే అంత ఎదురుగాలి వత్తిడి తక్కువ; ఎక్కువ
వేగంగా పోతుందన్నమాట' అని తాను వూహించిన విషయాల్ని
ఐవ్ చెప్పాడు.

'అదీ సంగతి. బాగా కనుక్కున్నావు బాబూ! ఆఁ ఇక
నిడివి-వెడల్పు సరిగ్గా సరిపోయే జాడుకొయ్యలు గీయాలి'
అన్నది వాళ్ళ అమ్మ.

'ఇంతకీ ఇదీ కాగితం స్లెడ్జేగా?' ఆర్చీర్ అన్నాడు.

'మొదట కాగితంమీద వేయటం చేతనైతే ఆ తరువాత
అసలు స్లెడ్జి చేయటం చాల తేలికే బాబూ! ఈ సంగతిమాత్రం
ఎప్పుడూ మరచి పోవద్దు. ఏం?' ఆవిడ తాపీగా అన్నది.

'దాన్ని నమూనా అంటారు. ముందు కాగితంమీద మనకు కావలసిన మాదిరి బొమ్మగీసి సరిగ్గా ఎంతకావాలో అంతవరకు కత్తిరించుకుని, ఆపైన దానినిబట్టి బట్ట కత్తిరించుకుంటే....'అని ఆవిడ వాళ్ళకు చెబుతుంటే 'ముందు నమూనా సరిగా కుదిరితే ఆతరువాత దుస్తులూ సరిగా అమరుతాయి' అంటూ తల్లి వాక్యాన్ని పూర్తిచేశాడు.

'ఆఁ ఇకపదండి. వెళ్ళి - కప్పలదొడ్లో కావాలిసినన్ని చెక్కలుంటాయి - వాటిల్లో బాగా తేలికగా ఉండేవి వేర్చండి. మధ్యలో ముడులు వుండేవిమాత్రం పనికిరావు. విల్, నీవు జాగ్రత్తగా ఎంతకావాలో అంతవరకు చెక్కలుకోయి. ఆర్విల్‌ని మాత్రం రంపం ముట్టుకోనియకేం,' అన్నది.

'అమ్మా! నాన్నగారి పనిముట్లు తీసుకో మంటావా?' విల్ భయం భయంగా అడిగాడు.

'ఊఁ. నాన్నగారు ఏమీ అనరులే. వెళ్ళండి. జాగ్రత్త బాబూ! సరిగా బొమ్మలో ఉన్నట్టే చేయాలి-తెలిసిందికదూ?' అంటూ మళ్ళీ ఒకసారి వాళ్ళకి జాగ్రత్తగా ఉండమని చెప్పి పంపించి.

విల్, ఆర్వి ఇద్దరూ చెల్లాయినికూడా వెంటతీసుకుని, కప్పల దొడ్లోకి పరుగెత్తుకువెళ్ళారు. వాళ్ళిద్దరూ ఇదంతా ఎంతో ముఖ్యమైన సంగతి అనుకున్నారు.

గెత్తింది. అక్కడ ఆడుకొంటున్న పిల్లలంతా ఈ కొత్త స్లెడ్జి వేపు వింతగా చూచారు. చాలపొడుగుగా సన్నగా వుంది. అసలు అందులో ఒక్కరుకూడా పట్టనట్టుగా కనపడింది. వాళ్ళస్లెడ్జీలకు వున్న జారుకొయ్యలు వెడల్పుగా ఉంటే దీనివి సన్నగా వున్నాయి.

'మీరు ఎవరు చేసిపెట్టారోయ్?' ఎడ్వర్డు అడిగాడు.

'మా అమ్మ ఎలాచేయాలో చూపింది' అని విల్బర్ సగర్వంగా అన్నాడు. ఈమాట వినేసరికి అక్కడి పిల్లలంతా గొల్లుమని నవ్వారు.

'ఎక్కడయినా ఆడవాళ్ళు స్లెడ్జీలు చేస్తారా? ఓయ్, ఓయ్,' అంటూ నవ్వటం మొదలు పెట్టారు.

'దానిమీద ఎక్కితే కూలిపోదూ?' అని జాన్స్టన్ నవ్వాడు.

'వస్తారా? పందెం వేసుకుందాం?' అంటూ మరొకడు ఛాలెంజిచేసి పోటీకి పిలిచాడు.

'ఓ! రండి ఒక్కొక్క దానిమీద ఇద్దరేసి ఎక్కుదాం. రండి' ఓపెన్ సవాల్ చేశాడు తిరిగి. అతని కేమీ భయంలేదు. బొమ్మసరిగా కుదిరింది కనుక స్లెడ్జికూడా సరిగానే ఉంటుందని విల్బర్ నమ్మకం. అయితే విల్బర్ అంత ధీమాగా పందెం వేయటానికి ఒప్పుకున్నాడు.

నాలుగు స్లెడ్జీలు వరుసగా నిలబెట్టారు. విల్బర్, ఆర్చీ ఇద్దరూ దానిమీద ఎక్కారు. కాని ఆ పిల్లలు అనుకున్నట్టు అవి పడిపోలేదు, కూలిపోనూలేదు. అప్పుడు విల్బర్ కి మరొక ఆలోచన తట్టింది.

'ఆర్చీ, ఊఁ మరే-కూర్చోవటం కాదురా! ఇదుగో ఇలా పడుకో. కాళ్ళు కొద్దిగా చాచాలి' ఆర్చిల్ వాళ్ళ అన్నాయ్ చెప్పినట్టే స్లెడ్జిమీద బోర్లగా పడుకున్నాడు. విల్బర్ వాడి వీపుమీద పనూ బోర్లగా పడుకున్నాడు. 'ఇలా అయితే ఎదురుగాలి దెబ్బ తగ్గుతుందిరా' విల్ తమ్ముడి చెవిలో మెల్లగా చెప్పాడు.

'ఆఁ అందరూ ఒక్కసారే తోసేయండి' ఎవరో పెద్దగా అరిచాడు.

అన్ని స్లెడ్జీలు ఒకేసారి తోసేశారు. ఒకేసారి కదిలాయి. ఆ కొండ నిటారుగా వుంటుంది. అంచేత నాలుగూ వేగంగా జారుతున్నాయి. చింది కళ్ళల్లో పడుతున్న మంచు తుడుచుకొంటూ విల్ అటూ యిటూ చూచాడు. మిగతా స్లెడ్జీలు కనపడలేదు. వెనక్కు చూచాడు. వాళ్ళవి వెనక ఎక్కడో వెనకబడి పున్నాయి. ఇరవై, ముప్ఫయి అడుగుల వెనుకబడిపోయాయి. వీళ్ళ స్లెడ్జిమాత్రం చాలముందు వెడుతూంది. జారుకొయ్యలు మంచుమీద జారుతూ సంగీతం లాంటి శబ్దం చేస్తుంటే పిల్లలకి భలేసరదాగా ఉంది. వీళ్ళ కొంత ముందుకి-వెళ్ళారు. కాని మిగతావాళ్ళు ఇంకా ఎంతో దూరాన ఉన్నారు.

మామూలుగా స్లెడ్జీలు కొంత అడుక్కురాగానే గిరుక్కున ఆగిపోతుంటాయి. కాని వీళ్ళది అలా ఆగిపోలేదు. అప్పటిలో అది ఇంకా వంద గజాలకుపైగా వెళ్ళిగాని ఆగలేదు.

విల్, ఆర్వీ ఆశ్చర్యపోతూ నిలుచున్నారు. 'క్రిందికి ఎగిరి వచ్చేశాంరా ఆర్వీ' విల్ తమ్ముడితో గర్వంగా చెప్పాడు.

'ఓఁ ఎగిరి వచ్చేశామే' ఆర్వీ అన్నాడు.

ఎడ్వర్డు, అల్‌జానీ కొంచెం నేపటికి చేరుకున్నారు. ఇదంతాచూస్తే వాళ్ళకేమీ అర్థంకాలేదు. ఇంత వేగంగా ఇది వరకు ఎప్పుడూ ఎవరి స్లెడ్జీ పోయివరగదు.

'మీరే ముందు ఎగిరి వచ్చారే. ఏదోయ్ నన్నొకసారి ఎక్కిచూడనీయరూ?' ఎడ్వర్డు అడిగాడు.

విల్బర్ తమ్ముడివేపు చూశాడు. తమ్ముడు అన్నవేపు చూచాడు. వాళ్ళచూపుల్లోనే ఏదో చెప్పుకొన్నారు. వాళ్ళిద్దరూ ఇది తయారుచేశారు. ఇది అందరి వాటికంటే చాలబాగుంది. ఇక ఎప్పుడయినా ఏమిచేసినా ఇద్దరూ కలిసి చేయాలనించే సన్న హాసం అప్పుడు వాళ్ళముఖాల్లో కనబడింది.

'ఆర్వీ, నాకొక ఆలోచన తట్టిందిరా. ఈ స్లెడ్జీ అంతా బాగానే ఉందికాని చుక్కాని ఉన్నాపుంటే ఇంకా భలేగా ఉంటుందిరా. ఒకటి తయారుచేసి పెట్టి చూద్దామా? అలా

అయితే పోతూ పోతూ ఎటు తిరగాలంటే అటు తిప్పవచ్చు కదూ?' విల్ తమ్ముడితో అన్నాడు.

'ఆఁ ఆఁ అమ్మను బొమ్మవేసి పెట్టమందాం' ఆర్వి అన్నాడు 'ఎందుకురా- మనమే బొమ్మకూడా వేసుకుందాం. మాటి మాటికీ అమ్మదగ్గర కెందుకూ ?' విల్ అన్నాడు.

వీళ్ళిద్దరూ ఇలా అనుకుంటూఉండగా కొండమీదనుంచి వాళ్ళచెల్లాయి దిగివచ్చి 'ఊఁ ఊఁ నన్నుగూడా ఎక్కిస్తా మనీ....' అంటూ కూనరాగం తీసింది.

'రాఁ. కేట్, రా. ఈసారి ముగ్గురం ఎక్కివద్దాం రండి. మేం వచ్చిన తరవాత నీవు ఎక్కిచూడవోయ్.' విల్ ఎడ్వర్డును ఆగమని తమ్ముణ్ణి-చెల్లాయినీ తీసుకొని కొండమీదికి స్లెడ్జీని నెట్టుకు పొయ్యాడు. విల్బరు చెవిలో రెండు మాటలు ఝుంకారం చేయుచుండేవి : 'మేం ఎగిరాం- మేం ఎగిరాం- మేం ఎగిరాం' అని.

# పెట్టిబండి తయారు చేశారు

కొన్నాళ్ళు అయిన తరువాత వాళ్ళ నాన్నగారు ఊరి నుండి తిరిగి వచ్చారు. ఆయన పేరు విల్బర్రైట్. ఆయన కోటు విప్పుతుండగానే ఈ కొత్త స్లెడ్జివైపు చూశారు. ఆ స్లెడ్జి ఎలాగ తయారయిందీ మొదలైన సంగతులన్నీ అప్పుడే వాళ్ళ నాన్నతో చెప్పారు.

'నేనే మీ పనిముట్లు తీసుకోమని పిల్లలకు చెప్పానండి' అన్నది వాళ్ళ అమ్మ. ఒక్క క్షణంసేపు వాళ్ళ నాన్న ఏమీ మాట్లాడకుండా మౌనంగా ఊరుకొన్నారు. కొత్త కొత్త వస్తువులు తయారు చేయటమంటే వాళ్ళ నాన్నకు కూడా యిష్టమే. ఆయన ఒకసారి సొంతంగా పైపుమిషను కూడా తయారు చేశారు. ఆయన తన పనిముట్లన్నీ యెప్పుడూ తళ తళ లాడేట్లు ఉంచుకొంటారు. అలా ఉంచేగాని ఆయనకు తృప్తి ఉండదు.

'నా పనిముట్లు పిల్లలకిచ్చావా ?' ఆశ్చర్యంగా అడిగారు. ఆమాట వినగానే పిల్లలిద్దరూ భయంతో ఒణికిపోతూ నిలుచున్నారు.

'అవునండి' అన్నదావిడ.

వాళ్ళనాన్న ఇంకేమి మాట్లాడకుండా ఆ పనిముట్లు ఉన్నచోటికి వెళ్ళి చూసి పదినిమిషాల తరువాత తిరిగి వచ్చాడు. కదలకుండావున్న కొడుకు లిద్దరివేపు చూస్తూ,

'మంచివాళ్ళేరా. వాటి నేమీ పాడుచేయలేదు. వాటికి యెవరో పదునుకూడా పెట్టారే?' అన్నాడు.

'మే మే నాన్నా! మా పనికాగానే మళ్ళీ అన్నిటికీ జాగ్రత్తగా పదునుపెట్టాం' విల్ ఆతురతో అన్నాడు.

'పనిముట్లు యెలా వాడుకోవాలో వాళ్ళకీ తెలుసులెండి' అన్నది వాళ్ళ అమ్మ నాన్నతో.

'నిజమేనమ్మా' నవ్వుతూ వాళ్ళ నాన్న అన్నాడు.

'మళ్ళీ ఒకసారి అవి కావాలి నాన్నగారూ! మా స్లెడ్జి యెటువయితే అటు తిరిగేట్టు తయారు చేసుకోవాలి' ఆర్విల్ అన్నాడు.

'మా స్లెడ్జి ఎటువయితే అటు తిరగటానికి వీలుగా ఒక చుక్కాని చేసుకోవాలి నాన్నగారూ' తమ్ముడు చెప్పినదాన్ని వివరిస్తూ విల్బర్ చెప్పాడు.

'స్లెడ్జికి చుక్కాని పెట్టగా ఎక్కడయినా చూచారటరా?' వాళ్ళ నాన్న అన్నాడు.

'మా పాఠాల్లో ఒకచోట పడవకు చుక్కాని చూచాం నాన్నగారూ. అలాగే మా స్లెడ్జికి కూడా చుక్కాని పెట్టుకుంటాం' విల్బర్ చెప్పాడు.

'ఏమో నాకు తెలీదు బాండీ' అన్నాడు వాళ్ళ నాన్న.

విల్బర్ వాళ్ళ నాన్న బల్లదగ్గరకు పరుగెత్తి ఒక కాగితంతెచ్చి ఆయనకు చూపాడు.

'మేం చాల బొమ్మలు గీశాం నాన్నగారూ. వాటిల్లో యిది చూడండి-యీ చుక్కాని బావుందికదూ ?' అన్నాడు.

'ఏదీ ఇటుతే' అంటూ వాళ్ళ నాన్న అది తీసుకొని పరికించి చూచాడు. దానిమీద పక్కాగా వేసిన చుక్కాని బొమ్మ ఉంది. అన్ని కొలతలు జాగ్రత్తగా సన్నగా చెక్కిన పెన్సిల్‌తో వేసి ఉంది. కొయ్యలో ఇలాంటి ప్రప్పుమటగల చుక్కాని తయారు చేయాలన్నమాట. దాన్ని రెండు యిరుకు రంగులలో స్లైటికి వెనుకవేపు బిగించాలి.

ఇదంతా చూచిన తరువాత వాళ్ళ నాన్న అమ్మవేపు నిశితంగా చూస్తూ, 'ఈ బొమ్మ నీవేనా వేసిపెట్టింది ?' అన్నాడు.

'లేదండీ వాళ్ళే సొంతంగా వేసుకొన్నారు. నేను వేసి పెట్టలేదు' అన్నది.

'బాగానే వేస్తున్నారే' అన్నాడాయన.

'మొదట కాగితంమీద వేసితే తరువాత పని సులువుతుంది నాన్నగారూ. అందుకనే యెన్నో కాగితాలు చెడగొట్టి యీ బొమ్మ జాగ్రత్తగా వేశాం.'

'మరి ఆ యినుప రింగులు యెక్కడ తెస్తారురా ?' వాళ్ళ నాన్న అడిగాడు.

'పాత యినుముకొట్టు దగ్గరకు వెళ్ళి తెచ్చాం గూడా నాన్నగారు. కార్మోడీ లేడు; ఆయన ఇచ్చాడు. చలికాలం పోయాక ఆయనకు పని చేసిపెట్టబోతున్నాము గూడా. ఒక పెద్ద బండి తయారుచేసుకొని రైతుల ఇళ్ళకు వెళ్ళి అతనికి పాత ఇనుము తెచ్చిపెడతాము' అని చెప్పాడు విల్.

'అన్నీ ఒక్కసారేనా ? ముందు మీ ముక్కాని తయారు చేసిపెట్టి చూడండి' అన్నాడు వాళ్ళ నాన్న.

'కాని నాన్నగారూ........' విల్ యేదో చెప్పబోయి ఆగాడు.

'ఆఁ. పనిముట్లు కావాలి-ఏం? ఊఁ తీసుకోండి. జాగ్రత్త, చేతిమీద వేసుకొంటారు !' అని నవ్వుతూ తన పనిముట్లు వాళ్ళకు యిచ్చాడు.

మరి ముక్కాని తయారుచేయటం అంటే బొమ్మ వేసినంత తేలికకాదు కదా ! కట్టెలదొడ్లో కూర్చుని దాన్ని తయారు చేసి తెచ్చి స్లెడ్జికి పెట్టి చూచారు. అది సరిగ్గా సరిపోయింది. బొమ్మ వేయటానికి అంతసేపు పట్టినా అది ఉపయోగమే అయింది.

ఆ రోజు మధ్యాహ్నమే స్లెడ్జి తీసుకొని కొండకు వెళ్ళి ప్రయత్నించి చూచారు. వీళ్ళ స్లెడ్జికి వెనుకవేపు అమర్చి

వున్న కొత్త వస్తువు చూచి పొరుగు పిల్లలందరికీ వింతగా వుంది. కాని యీసారి వాళ్ళెవరూ వీళ్ళను చూచి నవ్వలేదు. ఇక ఎప్పుడూ నవ్వరు కూడా. విల్ చుక్కాని పట్టుకు న్నాడు. స్లెడ్జీ వేగంగా జారుతోంది. విల్ చుక్కాని త్రిప్పగానే స్లెడ్జి ఎడమప్రక్కకు తిరిగింది. మళ్ళీ కుడిప్రక్కకు త్రిప్పితే అటూ తిరిగింది. పడవలాగా వాళ్ళ స్లెడ్జి యెటు తిరగాలంటే అటు తిరుగుతోంది.

ఆ వేళ రాత్రి మబ్బు పట్టింది. ఆ తరువాత వారం రోజులవరకు రోజూ వర్షం పడుతూనే వుంది. మంచు అంతా కరిగిపోయింది. రోజూ ఎల్బర్, వాళ్ళ తమ్ముడూ స్కూలు నుంచి తడుచుకుంటూ బురదలో నడిచి వస్తూ ఉండేవాళ్లు. ఇంటికి వచ్చీ రాగానే ఇంటివద్ద చేయవలసిన స్కూలు లెక్కలు, అవి చేస్తూండేవాళ్ళు. అదంటే ఇతరులకువలె, వాళ్ళకు నను ఇష్టం యెక్కువై గాదు. కాని అది త్వరగా చేసివేసుకుంటే ఆ తరువాత వాళ్ళ వస్తువులు చేసుకోవచ్చు.

మెల్లి మెల్లగానే హిస్టరీ, (చరిత్ర) జాగ్రఫీ, (భూగోళ శాస్త్రము) స్పెల్లింగు(అక్షరజ్ఞానము) వస్తున్నవి. కాని లెక్కల్లో మాత్రం వాళ్ళు చాల చురుగ్గా వుండేవాళ్ళు. మాష్టారు యిచ్చిన ఎంత గొట్టు లెక్కలైనా అట్టే వేసి వేసేవాళ్ళు. అది చూచి వాళ్ళ అమ్మ నవ్వుకుంటూ వుండేది. వాళ్ళ నాన్న లాగానే ఏవైనా వస్తువులు తయారుచేయటం అంటే వాళ్ళకు భలే

యిష్టం. పనిముట్లు చేతికి దొరికితే చాలు పట్టరాని ఆనందం కలుగుతుండేంది. వాళ్ళ నాన్న గొప్ప విద్యావేత్త. ఆయన మంచి యింగ్లీషుభాష వ్రాసేవారు. ఇది మాత్రం విల్బర్‌కు ఆర్వీకి పంటపట్టలేదు. వాళ్ల నాన్నకు లెక్కలంటే చలినొప్పి. ఒక వరస కూడిక కూడమన్నా ఆయనకు చేతరాదు. పిల్లలకు లెక్కలంటే మాత్రం ఎంతో తేలికగా ఉండేది. ఈ విష యంలో వాళ్ళు అచ్చుగా వాళ్ల అమ్మలాగానే చేసేవాళ్ళు.

రోజూ ఒక అరగంటసేపు పాఠాలు- అవీ వ్రాసుకో వటం కాగానే ఆర్వీ వాళ్ళ అన్నాయ్‌వేపు చూచి 'ఏది అయిందా అన్నాయ్?' అని అడుగుతాడు. ఎప్పుడూ ఆర్విల్‌పనే ముందుగా పూర్తి అవుతుంటుంది. ఆర్వీ, విల్బర్ అంత జాగ్రత్తగా చేయ లేడుగాని ప్రతి విషయం ముందుగా తెలుసుకోవటంలో వాడే చురుకైనవాడు. విల్బర్ అంతకంటే కొంచెం ఆలస్యంగా చేసినా తప్పులు లేకుండా చేస్తాడు.

ఈ పని అయిపోగానే ఇద్దరూ లేచి కట్టెల దొడ్లోకి పరుగెత్తి వాళ్ళ యింటి పని మొదలుబెట్టే వాళ్ళు. వంట యింట్లోవుండే కొయ్యలపెట్టె పదినిమిషాల కొకసారైనా ఖాళీ అవుతుండేది. కొయ్యలపెట్టెను నింపి పెట్టుకుని అది తిరిగి నింపటం వీళ్ళిద్దరి పని. విల్బర్ కట్టెలు కోసి మొద్దులు పగుల కొడుతూ వుంటాడు. అతనికి యీ పని బాగా చేతవచ్చు. విల్బర్ చీల్చిన ముక్కలన్నీ ప్రోగుపెట్టి తీసుకుపోయి వంటయింట్లో

పెట్టెలోవేసి రావటం ఆర్విల్‌పని. ఆ పెట్టె నిండగానే 'ఇక చాల్లేరా అన్నాయ్' అనేవాడు ఆర్విల్. అది కాగానే విల్బర్ గొడ్డలి బాగా తుడిచి పనిముట్లలో బల్లమీద పెట్టేవాడు.

అది కాగానే ఇద్దరూ వంట యింట్లోకి పరుగెత్తేవాళ్లు.

'చేతులు కడుక్కోండిబాబూ' అని వాళ్ళ అమ్మ అనగానే ఇద్దరూ వెళ్ళి శుభ్రంగా కడుక్కొని వచ్చేవాళ్ళు. అప్పుడిక కాగితం, పెన్సిలూ, రూళ్ళకర్ర పుచ్చుకొని వంటయింట్లో బల్లవద్ద కూర్చుని బొమ్మలు వేయటం మొదలుపెట్టేవాళ్ళు. ఇక యిపుడు వాళ్ళకు తొందర ఏమీ వుండేదికాదు. వాళ్లొక పెట్టెబండి తయారు చేయాలనుకున్నారు. దీనివల్ల ఎంతో ఉపయోగం ఉంది. వీళ్ళిద్దరూ కార్మోడీతో మాట్లాడారు. రైతుల దగ్గర చాలా పాత యినుము వుంటుందనీ అదంతా అమ్ముతారనీ చెప్పాడు. కార్మోడీకి గుర్రపుబండి లేదు. అతనంతట అతనే పోయి ఈ యినుము అంతా తెచ్చుకోటానికి అతనికి తీరికలేదు. అంతకుముందు కొన్ని వస్తువులు సర్దుకోటంతోనే అతనికి సరిపోతూ వుంటుంది.

విల్బర్ వాళ్ళకేగనక ఒక పెట్టెబండి వుంటే వాళ్ళే పోయి యీ పాతయినుము అంతా కార్మోడీకి తెచ్చిపెట్టవచ్చు. రైతులు బాగుచేయించుకోలేక పాత యినుముక్రింద అమ్మివేసే పాత గొడ్డళ్ళు, తెగిన గొలుసులు, అరిగిన మేకులు, నట్లు, పాత సైకిళ్లు అన్నీ తెచ్చి కార్మోడీకి యిస్తే అతను వీళ్ళకు

డబ్బులు యిస్తాడు. అందుకే వాళ్ళు పెట్టెబండి తయారు చేయా లనుకున్నది. పెట్టెబండి వుంటే ఆ పని చేసుకోవచ్చు.

వాళ్ళ నాన్నకు తెలిసినవాళ్ళందరి పెట్టెబండ్లు జాగ్రత్తగా పరిశీలించి చూచారు. అయితే వీళ్ళబండి తేలికగా వుండాలి. లేకపోతే వాళ్ళు దాన్ని లాక్కుపోలేరు. అయితే ఇసుమువేస్తే విరిగిపోకుండా వుండేది కూడా కావాలి. వాళ్ళ పొరుగునే ఒక చిల్లరవర్తకుడి పెట్టెబండి లాంటిదే చేయాలనుకున్నారు. అతని బండిచక్రాలు సన్న ఇనుప పట్టాతో కప్పబడ్డవి. అవి కొని వేసినవి. అలా కొనడానికేమో వీళ్లవద్ద డబ్బులు లేవు.

'సరేలే చక్రాలు కూడా కొయ్యతోనే చేద్దాం' అన్నాడు విల్బర్ కొద్దిగా నిరుత్సాహంగా.

'ఏయ్ ఎడ్వర్డుదగ్గర ఒక కొయ్య చక్రాలబండి వుంది. నిన్న అందులో చెల్లాయిని కూర్చోబెట్టి నెట్టిచూస్తే కదలటమే కష్టమైందిరా ! కొయ్యచక్రాలు పనికిరావు' తల వూపుతూ అన్నాయ్‌తో ఆర్విల్ అన్నాడు. 'కొందరు రైతులుకి కొయ్య చక్రాల బళ్ళేఉన్నవి. వాటికి ఎద్దుల్నిగట్టి లాగిస్తారు' విల్ అన్నాడు.

'మరి వాళ్లబళ్ళు లాగటానికి ఎద్దులు వుండెగా! ఔను సరేగాని యిది నీకు తెలుసుటరా అన్నాయ్ ?' ఆర్విల్ అన్నాడు.

'ఏమిటిరా ?' విల్ అడిగాడు. ఈమధ్య రెండు మూడు వారాలనుంచి విల్బర్ ఒక సంగతి మాత్రం నేర్చుకున్నాడు.

ఆర్వీ ఏదయినా కొత్తసంగతి అడిగితే జాగ్రత్తగా వినటం నేర్చుకొన్నాడు. ఆర్వీ తనకంటే చిన్నవాడే. తనకు పన్నెం డేళ్ళు వుంటే వాడికి ఎనిమిదేళ్ళే. అయినా ఒక్కొక్కసారి వాడు విల్బర్‌కి వింత కలిగించే సంగతులు చెబుతుంటాడు.

'ఆఁ తెలిసిందిలే. నిన్న కార్మోడీ కొట్టుకి రెండు పాత సైకిళ్ళు వచ్చాయిరా. అవి ఏమంత మంచివికావని అతనే చెప్పాడు. కాని అవి బాగానే వున్నట్టు కనపడుతున్నాయి. కాక పోతే చాల పూచలు పోయినట్టుందిలే. అయితే తీగపెట్టి పోయిన పూచలు వేద్దాం' అని చెప్పాడు ఆర్విల్.

'ఆఁ అయితే పోదాంపదరా కార్మోడి అవి యిస్తాడేమో అడుగుదాం' విల్బర్ అన్నాడు.

# తొలి సొంత సంపాదన

ఆర్విల్ చెప్పింది నిజమే. ఆ రెండు ముచ్చక్రాల సైకిళ్ళూ చాల పాతబడిపోయి వున్నాయి. అయితే వాటి చక్రాలు బాగుచేసుకోవచ్చు. కాని వాటిని బాగుచేసి వాడుకోవటానికి కార్మోడికి గిట్టదు. అతనికి గుర్రం లేదు, బండీలేదు, అవకాశం లేదు. కొన్ని సామానులను ప్రమాదయిగాను ఇనుములుగాను వేర్వేరుగ ఏర్పరచి గిడ్డంగిలో దాచిపెట్టాం. షాపులోనే ఉంచాం. విల్బర్-ఆర్విల్ అతని దగ్గరికి వెళ్ళి ఆ చక్రాలు కావాలని అడిగారు. కార్మోడీ నవ్వాడు.

'అయితే ఇస్తానుకోండి, బాగుచేస్తారు - బాగానేవుంది. ఆ తరువాత వాటిని మీ పెట్టెబండికి ఎలా బిగించాలో తెలుసా మరి ?' అని అడిగాడు.

'ఆఁ మొదట బొమ్మగీసి చూచుకొంటాంలే' అన్నాడు విల్బర్.

'బొమ్మలు గీస్తారా ?' కార్మోడికి ఆ మాట వింటే కొంచెం ఆశ్చర్యం కలిగింది.

అప్పుడు విల్బర్ చెప్పాడు. వాళ్ళ అమ్మ దుస్తులు కుట్టుకొనే ముందు వాటి నమూనా బొమ్మలు కాగితాలమీద వేసుకుందనీ ఆ బొమ్మలు సరిగా కుదిరితే దుస్తులుకూడా బాగ్గానే

కుదురుతాయని వాళ్ల అమ్మవద్ద నేర్చుకొన్నదంతా కార్మోడీతో చెప్పాడు. తానూ తమ్ముడూ కలిసి స్లెడ్జిని తయారుచేసిన సంగతి కూడా వివరంగా చెప్పాడు. విల్బర్ ఇదంతా చెబుతుంటే కార్మోడీ జాగ్రత్తగా విన్నాడు. పెద్దబండికి కొయ్యచక్రాలు పెడితే ఎడ్వర్డ్ సైన్స్ బండివలె లాగటం కష్టంఅని ఆర్విల్ చెప్పాడు.

'మీరు చెప్పేది బాగానేవుంది. కాని మొదట్లో సైకిళ్లకి కూడా కొయ్యచక్రాలే ఉండేవి. ఆ చక్రాలు నూరు పౌనుల దాకా బరువు వుండేవి. ఆ రోజుల్లో సైకిలు తొక్కటం అంటే ఎముకలు విరిగినంతపని అయ్యేది. అందుకే వాటిని అప్పుడు 'ఎముకలు కొరికే బళ్లు' అనేవాళ్లు. అయినా వాటినే చాలమంది కొని ఎక్కి తిరిగేవాళ్ళు' అని చెప్పాడు కార్మోడి.

'మరి ఆ తరువాత ఏం జరిగింది ?' ఆర్విల్ అడిగాడు. 'ఆ తరువాత ఫ్రాన్సుదేశంలో ఒకాయన యీ బండ సైకిళ్ళను గురించి ఆదేపనిగా ఆలోచించటం మొదలుపెట్టాడు. తక్కువ బరువు వుండేలా సైకిళ్లు తయారు చేయగలిగితే అవి తేలికగా పరుగెత్తుతాయి గదా అనుకున్నాడు. కనుక లోహపు చక్రాలు సైకిళ్ళకు పెట్టటం మంచిదనుకొని అలాగే చేయించాడు. అయితే పూచలు మాత్రం కొయ్యవే. వాటిచుట్టూ రబ్బరుటైర్లు వేయించాడు. రబ్బరు అంటే పూర్తిగా రబ్బరువి అన్నమాట. గోలుగా ఉండేవి కాదు. అలా వేయటంచేత అదివరకు ఉన్న

సైకిలు బరువులో సగం తూకం మాత్రమే ఉండే సైకిలు తయారయింది. ఈ కొత్తరకం సైకిలు పాతదానికంటే తేలికగా పరిగెత్తేది కూడా' అని కార్మోడి వాళ్లకు సైకిలు కథ చెప్పాడు.

'మరి యిప్పుడు సైకిళ్ళకి ఇనుప వూచలుంటాయిగా ?' విల్ అడిగాడు.

'ఆఁ అవును. ఆ తరువాత మరి కొంతకాలానికి అమెరికా దేశస్థుడొకడు ఇదికూడా అంత బాగాలేదని ఇనుప వూచల చక్రాల బొమ్మగీచి చూచాడు. ఈ సైకిలు యింకా బరువు తగ్గి గట్టిగా వుంటుందనుకున్నాడు. ఈ సైకిలు దాని బరువుకు పదిరెట్ల బరువును మోస్తుంది. అందుకని తన బొమ్మ ప్రకారం కొత్తరకం సైకిలు తయారు చేయించాడు.

'అంతే. అతని బొమ్మ సరిగావుంది కాబట్టి అతని సైకిలు కూడా బాగా కుదిరింది' విల్ అన్నాడు.

'ఇప్పుడు నా సైకిలు చూచారుగా. దాని బరువు 20 పౌనులు ఉంటుంది. మరి నా బరువో రెండువందల పౌనులు. అంటే సైకిలు బరువుకు పదిరెట్లు బరువును అది మోయగలుగుతుందన్నమాట. అలాగా మీ పెట్టెబండి కూడా చేయండి. అది దాని బరువుకు పదిరెట్లు బరువు మోస్తుంది. ఆ రెండు పాతసైకిళ్ళు తీసుకుపోయి వాటిని బాగుచేసుకో గలిగితే వేసుకోండి. ఇదిగో యీ బరువు తీగె, ఈ ఇరుసు గ్రీసు కూడా తీసుకుపొండి' అన్నాడు కార్మోడి.

అవి మూడుచక్రాల సైకిళ్ళు. ముందు చక్రం పెద్దది, వెనుక చక్రాలు చిన్నవిగా వుంటాయి. ఆ రెండు సైకిళ్ళనూ వాళ్ళిద్దరూ మోసుకొని త్వరత్వరగా వెళ్ళి వాటిని షెడ్డులో పెట్టి ఇంటికి వెళ్ళారు. ఇద్దరూ వంటయింట్లో టేబులువద్ద కూర్చొని ఎన్నో ఆలోచనలు చేస్తున్నారు. ఇంతలో ఎడ్వర్డు తలుపు తెరుచుకొని లోపలికివచ్చి చేపలు పట్టుకొందాం రమ్మని పిలిచాడు.

విల్బర్ తమ్ముడువేపు చూస్తూ 'మాకు చాలా పనివుంది. మేం రాములే వెళ్ళండి' అన్నాడు ఎడ్వర్డుతో.

విల్బర్‌కంటే ఆర్విల్ నాలుగేళ్ళ చిన్నవాడు. అయినా విల్ ఎప్పుడు ఆర్వీతోనే కలిసి వుంటాడు. ఇలా ఏంచేస్తు న్నారా అని ఎడ్వర్డు, ఛాన్సీ స్మిత్ మొదలైన తోటి పిల్లకాయ లందరికీ ఆశ్చర్యంగానేఉంది.వాళ్ళకేమీ అర్థంకాలేదు. ఎడ్వర్డు, స్మిత్తు చేపలు పట్టుకోటానికి వెళ్ళిపోయారు. అన్నా-తమ్ముడు యిద్దరూ బల్లమీద వంగి బొమ్మలు గీచుకోవటం మొదలు బెట్టారు.

వాళ్ళ అమ్మవచ్చి చూస్తూ కూర్చుంది. ఆవిడ చాలా చురుకైనది. చూస్తున్నదేగాని వాళ్ళకు ఏమీ ఒక్కమాట కూడా చెప్పటంలేదు. తనను ఏమైనా అడిగినప్పుడు మాత్రం కొంచెం 'ఇలాకాదు అలా వేయాలి' అని చెబుతుంది అంతే. వాళ్ల తెచ్చిన చక్రాలకు బిగువుగాపట్టే ఇరుసులు రెండు వెతికారు.

దొరికాయి. పెట్టెబండికి అతికించడానికి వేసిన ప్లానుగూర్చి తల్లి అభిప్రాయం కోరారు.

'ఊఁ రాపిడి ఎక్కువవుతుంది' అన్నది వాళ్ళ అమ్మ ఆ ఇరుసులు చూచి.

'రాపిడా?' ఆర్వీల్ యీ మాట వినటం యిప్పుడే మొదలు. అతనికి అదేదో కొత్తగా వుంది.

'రెండు కర్రలు ఒకదానికివేసి ఇంకొకటి రుద్దితే ఏమవు తుంది? అదే రాపిడి అంటే. రెండు కర్రలు రుద్ది చూడండి' అన్నది ఆవిడ.

'అరిగిపోతాయి' ఆర్వి వెంటనే చెప్పివేశాడు.

'ఆఁ మీ ఇరుసులు కూడా అంతే. అవి అంత బిగు వుగా వుంటే ఎల్లప్పుడూ రాచుకుంటూ ఉంటాయి. నాలుగు రోజుల్లో ఇరుసుకాస్తా అరిగిపోతుంది. అంత బిగుతు పనికి రాదు. ఆ ఇరుసులు గనుక బాగా అరగదుద్దితే కొంచెం వదులు అయ్యేట్లు చేయవచ్చు. చక్రంమధ్య (Hub = హాము) లోపలి ప్రక్క ఇరుసు చివరిభాగమూ బాగా నునుపుజేసి గ్రీసు పెడితే కొంచెం బాగా పనిచేస్తుంది.'

ఆ తరువాత వారం రోజుల్లో ఆ పిల్లలిద్దరూ పెట్టెబండి పూర్తిచేశారు. వసంతకాలం రాబోతూంది. రైతులు కట్టెల దొడ్లు, చావళ్ల అన్ని శుభ్రం చేసుకొనే రోజులు వచ్చాయి. పాత సామానులు బయట పారవేసేది ఈ రోజుల్లోనే.

ప్రతిరోజూ ఇద్దరూ బడినుంచి రాగానే పుస్తకాలు ఇంట్లో పెట్టివేసి బండి లాక్కొని బజారువెంట వెడతారు. ఆ బండి నిండేదాకా పాతసామానులన్నీ కూర్చుకొని చీకటి బడక ముందే ఇంటికి చేరుకునేవాళ్ళు.

ఇక వేసవి శెలవలు రాగానే ఉదయాన్నే అన్నంతిని బయలుదేరారంటే రోజంతా అక్కడే తిరిగేవాళ్లు. ఇలా పాత



సామానులు తెచ్చిపెట్టినందుకు కార్మోడీ వాళ్ళకు బాగా డబ్బులు ఇస్తుండేవాడు. జీవితంలో తొలిసారిగా వాళ్ళు సొంతంగా డబ్బులు సంపాయిస్తున్నారన్నమాట. రోజూ వచ్చిన డబ్బులు

ఇద్దరూ సమంగా పంచుకునేవాళ్ళు. అయితే ఆ డబ్బు లన్నీ ఏంజేసేవాళ్ళనుకుంటున్నారు? వారానికి ఒకసారి శని వారంనాడు మిఠాయి అంగడికి వెళ్ళి ఏవైనా మంచి పదార్థాలు కొనితెచ్చుకునేవాళ్ళు. వాళ్ళు ఇంత కష్టపడి సంపాయించుకునే డబ్బులన్నీ ఇలా మిఠాయి అంగడికే ఇచ్చేవాళ్ళు. ఇలా వుండగా ఒకనాడు వాళ్ళు ఒకగాలిపటం కొనుక్కోవాలనుకున్నారు. అయితే అమ్మే గాలిపటం వాళ్ళకు అంత తృప్తిగాలేదు.

వాళ్ళ ఊళ్ళో దుకాణంలోవున్న గాలిపటాలన్నీ పరీక్షించి చూచారు. పెద్ద గాలిపటాలు చాలా ఎక్కువ ఖరీదు వుండేవి. ఇక మామూలువే ఒక్కొక్కటి నలభయిసెంట్లు (అంటే రెండు రూపాయలు) దాకా వుంది. చిరిమాడి చిరిమాడి చివరికి ఒకటి బయటకి తీశారు.

.ఆవేళ మధ్యాహ్నం అది తీసుకొని కొండగట్టుకి వెళ్లారు. వాళ్ళు కొన్నది మంచిదే. ఎప్పట్టు గాలిపటంలాగానే వుంది. అయితే వాటికంటే ఎక్కువగా మాత్రం లేదు. అన్నిటిలాగానే వీళ్ళ గాలిపటం కూడా ఎగురుతూ వుండి వుండి దుడింగిన వాలి పోతుంది. పోయి ఏ చెట్టు కొమ్మల్లోనో ఇరుక్కుపోయింది.

'అన్నాడ్ ఇలాంటిదైతే మనమూ చేసుకోవచ్చురా. అసలు ఇంతకంటే మంచిదే చేయవచ్చునన్నాగా!' అని ఆర్విల్ అంటుంటే వాళ్ళ అన్నాయ్ కళ్ళల్లో ఏదో ఆలోచన తోచింది.

స్లెడ్జి, పెట్టెబండి లాంటివి తయారుజేసినవాళ్ళకి గాలి పటం చేయటం ఒకలెక్కా ఏమిటి? తలుచుకొంటే ఎన్ని పటాలయినా చేయొచ్చు. అలా తయారుచేసి వూళ్ళో పిల్లలకు అమ్ముకుంటే వాళ్ళకు డబ్బులు కూడా వస్తాయి.

'అవునురా ఆర్వీ, ముందు ఒకటి పెద్దది మంచిది తయారుచేసుకుని చూద్దాం. ఆ తరువాత మరిన్నిచేసి అమ్ముకోవచ్చు' అన్నాడు విల్బర్.

ఆ రోజు మధ్యాహ్నం గాలి ఝుయ్యున వీస్తోంది. ఆగాలి దెబ్బకు ఆర్విల్ చేతిలోవున్న గాలిపటం ఆకాశాని యెగిరి పోయింది.

'అరెరె! అన్నాయ్ ఇంకా చాలా పెద్ద గాలిపటం తయారుచేస్తే అది మనల్నిగూడా గాలిలోకి ఎత్తుకుపోయేలా వుందిరా' అన్నాడు ఆర్విల్.

'అవునురా' అంటూ విల్బర్ నవ్వాడు. కాని వెంటనే అతనిలో నవ్వు మాయమయింది.

'ఎప్పుడో ఒకరోజు చేయలేకపోము లేరా' అన్నాడు మళ్ళీ విల్బర్.

'అన్నాయ్' గాలిపటం పట్టుకొని గాలిలో ఎగిరిపోతుంటే ఎలా వుంటుందోరా!' ఆర్విల్ యేదో వూహించుకొంటూ అన్నాడు.

'పక్షుల్లాగా మనం ఆకాశంలోకి ఎగిరిపోవచ్చునన్న మాటే' విల్బర్ అన్నాడు.

'పక్షులకి రెక్కలు ఉంటాయిగా ?' ఆర్విల్ సందేహము తెలుపుతూ అన్నాడు.

'మనకు రెక్కలు మనమే తయారుచేసుకుందాం. గాలిపటాలే మనకు రెక్కల్లాగా పనికిరావచ్చురా' విల్బర్ అన్నాడు.

వుండే వాటికంటే పెద్ద పటాలు తయారు చేయాలనుకున్నారు. అయితే దీనికి యెలాంటి చెక్కలు ఉపయోగించాలా అన్న అనుమానం వచ్చింది. వాళ్ళకు దుకాణం అతను యిచ్చిన చెక్కలు చిన్న పటాలకయితే పనికొస్తాయిగాని పెద్దవాటికి ఆగవు. వాళ్ళ దొడ్లోవున్న చెక్కల్లో సడింపు (బరువు) ఎక్కువగా వుంది.

ఆ ఊళ్ళో ష్వార్ట్స్ అనే ఒక జర్మన్ అతను చాల కాలంనుంచి వుంటున్నాడు. అతను బీరువాలు, పెట్టెలు చేస్తూ వుంటాడు. పనికిరాని పాతబీరువాను చక్కబెట్టి సొగసుగ నిలిపించి, సూసన్‌రైట్ అమ్మకు ఇచ్చాడు. ఆయన మంచి వడ్రంగి, బీరువాల కుశలుడని ఆమె తన స్నేహితురాండ్రకు చెప్పేది. వీళ్ళ మూలంగానే అతనికి ఆ వూళ్ళో బాగా పనికూడా దొరుకుతూంది. అందువల్ల సూసన్ (విల్బర్ తల్లి) అంటే అతను చాలా విశ్వాసంతో వుండేవాడు. వాళ్ళ అమ్మ వాళ్ళిద్దరినీ అతనివద్దకు తీసుకువెళ్ళింది. అప్పుడు విల్బర్‌కు పద్నాలుగేండ్లు, ఆర్విల్‌కు పది. వాళ్ళు అతనితో తమకు కావలసిన వాటిని గురించి చెప్పారు. అతను ఇదంతా సరదాగానే విన్నాడు.

'నేను ఎప్పుడూ గాలిపటాలుచేసి ఎరుగనుగాని-వాటికి తేలికగా, విరిగిపోకుండాఉండే చెక్కలు కావాలనుకుంటాను. ఎదురుబద్దలు వున్నాయిగాని అవి త్వరగా వంగిపోతాయి అబ్బాయి గారూ—అయినా యీ చెక్కను తీసుకుపోయి చేసి చూడండి'

అంటూ వాళ్ళకు స్ప్రూస్ జాతిచెక్క ఇచ్చాడు. రెండు గాలిపటాలకు సరిపోయేటంత చెక్క తీసుకొని ఇంటికి పరుగెత్తుకుంటూ వెళ్ళారు. కొద్దిసేపట్లోనే బద్దలు బిగించి దానికి ఉల్లిపొర కాగితం అంటించారు.

ఈ కొత్త గాలిపటం ఎవరూ లేనప్పుడు ఎగరవేసి చూచుకోవాలనుకున్నారు. అందుకని మరునాడు ఉదయం ఆరు గంటలకే బిగ్ హిల్ కొండ గట్టువద్దకు వెళ్ళారు. అప్పుడు గాలి చక్కగా వీస్తున్నది. గాలిపటం ఎగురవేశారు. అది ఆకాశంలోకి నిటారుగా ఎగిరిపోయింది. చాల ఎత్తుకు పోయిన తర్వాత ఉన్నట్టే ఉండి ఒక్కసారే గాలి ఆగిపోయింది. గాలిపటం గిర్రున వాలిపోయి ఒక చెట్టుకొమ్మల్లో ఇరుక్కుపోయింది.

విల్బర్ చెట్టుఎక్కి కొమ్మల్లో ఇరుక్కుని పాడయిన గాలిపటం తీసుకువచ్చాడు. ఉల్లిపొర కాగితం అంతా చిరిగి పోయింది. బద్దలు కూడా మళ్ళీ పనికిరాకుండా పాడయి పోయాయి.

'ఇంకా నయంరా అన్నాయ్. ఇప్పుడుగనక ఆ ఎడ్వర్డు వాళ్లు చూస్తే మనల్ని నవ్వేవాళ్ళు కదూ?' దిక్కుమొగంవేసి ఆర్వి అన్నాడు.

'మనం ఏదో పొరబాటు చేసినట్టున్నాం. అదేమిటో తెలియటంలేదు ఆర్వీ' విల్బర్ నిరాశతో అన్నాడు.

'అసలు బొమ్మ తప్పుపోయి వుంటుంది. లేకపోతే పటం ఎందుకు పడకుండా పోతుంది ?' ఆర్విల్ అన్నాడు.

'సరేలే. ఈ వేళ స్కూలయిపోయింది రాగానే మళ్ళీ బొమ్మ వేసి చూద్దాం' విల్ అన్నాడు.

ఆవేళ మధ్యాహ్నం గీసిన బొమ్మ తీసి చూశారు. అది అంతా సరిగానే వున్నట్టు కనపడింది.

'అసలు- గాలిపటం ఎందుక వాలిపోతుందంటావ్ ?' ఆర్విల్ అడిగాడు.

'ఏమోరా నాకూ తెలీదు. గాలి ఏమో ఎప్పుడూ ఉండదు. గాలి ఉన్నపుడు మాత్రం పటం ఎగురుతూ వుంటుంది. అంతే గదురా ?' విల్ ఏమిటేమిటో ఆలోచిస్తూ అన్నాడు.

'అవునురా అన్నాయ్' ఆర్వీ అందుకొన్నాడు.

'గాలి ఆగిపోగానే పటం వాలిపోతుంది. అంటే కావలసినంత గాలి లేనపుడు వాలిపోతున్నదన్నమాట. అంతేగా ? అయితే గాలి వేగం తగ్గిపోయిందేగాని పూర్తిగా ఆగిపోలేదుగా' విల్ అన్నాడు.

'మరి గాలి లేకపోయినా పక్షులు పడిపోవేం ?' ఆర్విల్ అన్నాడు.

'పక్షులకి వుండే రెక్కలు ఎంత తక్కువ గాలినయినా అందుకుంటున్నాయన్నమాట.... అదేరా సంగతి. మన పటం

చాలినంత గాలిని పట్టుకోలేకపోతుందిరా' విల్ ఆకాశంలోకి చూచి ఆలోచిస్తూ అన్నాడు.

'మధ్యలోవున్న కట్టు మరీ బిగువు అయిందేమో!' ఆర్విల్ అన్నాడు.

ఆ రోజుల్లో కూడా యీ రోజుల్లో పిల్లలు ఎగురవేసే లాంటి గాలిపటాలే వుండేవి. మధ్యలో ఒక కట్టు వుంటుంది. దాని చివరను తోకలాగా ఒక గుడ్డపీలిక వ్రేలాడుతుంది.

'నిజమేలాగుందిరా మధ్యలో వుండే కట్టు (Belly band) మరీ బిగువు అయ్యేసరికి లోవంపు రాదు. అంచేత ఓడచాప తీసుకొనేలాగు తగినంత గాలిని తీసుకోలేకపోతూంది. అంతే. గాలి తగ్గిపోగానే నిలవలేక వాలిపోతుంది' విల్ అన్నాడు.

'అయినా ఇంకా కొంచెం పొడుగయినా నడికట్టువేస్తే?' ఆర్వి అన్నాడు.

ఇద్దరూ బల్లమీద వంగి ఆ విధంగా కొత్త బొమ్మ గీస్తున్నారు.

'అన్నాయ్ ఈ తోక ఎందుకురా?' ఆర్వి అడిగాడు.

'అది పటం అటూ ఇటూ ప్రక్కలకూ పోకుండా నిలిపి వుంచటాని కనుకుంటా' విల్ చెప్పాడు కొంచెం అనుమానంగా.

గట్టు దగ్గరికి వెళ్ళారు. ఆ వేళకూడా గాలి బాగానే వుంది. కాని కొంచెంసేపు ఎక్కువగానూ కొంచెంసేపు తగ్గుతూ ఇలా వుంది. కొత్తగాలిపటం ఎగురవేశారు. బాగానే పైకి పోయింది. కాని అక్కడ అది నిలకడగా వుండటల్లేదు. ఆ ప్రక్కకు యీ ప్రక్కకు వాలిపోతున్నది.

'తోక పొడుగు చాల్లేదులా వుంది' అన్నాడు ఆర్విల్.

పటం క్రిందికి దింపి దాని తోకకు మరొక అడుగు పొడుగు గుడ్డపీలిక ముడిపెట్టారు. ఈసారి చాలా బాగా ఎగురుతున్నది. రెక్కలున్న పక్షి ఎగిరినట్టే వుంది. బాగా పైకిపోయి దారమంతా పైన నిలిచివుంది.

'ఆహాఁ ఇప్పుడు చూడరా అన్నయ్యా ఎంత బాగావుందో?'

'ఈసారి సరికట్టు పొడుగ్గా పెట్టాంకదూ. గాలి తగ్గిపోయినా వాలిపోకుండా ఎగురుతూంది. దీని పైకు దూరమయినా ఎగిరివేయవచ్చురా' విల్ అన్నాడు.

'ఈవేళ మధ్యాహ్నం మళ్ళీ వేసి చూద్దాం......ఏం?' ఆర్విల్ అన్నాడు.

సరేననుకొని ఆ రోజు మధ్యాహ్నం మిత్రులు వాళ్ళతో పాటు వీళ్ళు కూడా పటాలు ఎగరవేసుకోడానికి వెళ్ళారు.

'మిగతా అందరి పటాలకంటే వీళ్ళది చాల పైకిపోయి బాగా ఎగురుతున్నది. ఒక్కసారి కూడా వాలిపోవటల్లేదు. ఆకాశంలో అందంగా ఆడుతున్నది. ఆ పిల్లలంతా ఈ పటం

'సరేలే తీసుకో' అని విల్బర్ ఆ పటం అతనికే ఇచ్చాడు.

ఆ తరువాత చాలా గాలిపటాలు తయారు చేశారు. చివరను కొన్ని గాలిబుట్టలు కూడా చేశారు. ఉల్లిపొర కాగితానికి బదులు సన్నటి గుడ్డతో ఈ బుట్టలు తయారుచేశారు. ఇవి మామూలువాటికంటే చాల పైకి ఎగురుతాయిగాని వీటిని చేయటం చాల కష్టం.

'అన్నాయ్ రెండు పటాలు ఒకదానికొకటి కట్టి ఎగరవేసి చూద్దాం ఏమవుతుందో? ఒక పటం ఎగరవేసి దాని దారానికి రెండోది కడదాం' అని ఆర్విల్ ఒక కొత్త ఉపాయం చెప్పాడు.

'ఆఁ వేసి చూద్దాం, పద' కొంచెం అనుమానంగా విల్బర్ అన్నాడు.

అలానే చేశారు. ముందు ఒకటి కొంత పైకి పోయిన తరువాత దాని దారం మధ్యలో రెండోది ముడిపెట్టారు. భలే బాగా ఎగిరాయి. ఆర్విల్ పట్టుకొని ఆడిస్తున్నాడు.

'అన్నాయ్ ఇది పట్టుకొని చూడు. చేతిలో నిలవటల్లేదురా. లాక్కుపోతోంది. చూడు ఇంకా' ఆర్విల్ చెప్పాడు హుషారుగా.

విల్బర్ పట్టుకొని చూశాడు. ఆర్విల్ చెప్పింది నిజమే. ఆర్విల్ ఇంకా కొంచెం దారం విడిచాడు. రెండోపటం కూడా ఆకాశంలోకి ఎగిరిపోతూంది.

'నన్నుకూడా ఎత్తుకుపోయేట్లుందిరా అన్నాయ్! ఎప్పుడో మనల్నికూడా ఎత్తుకుపోయే గాలిబుట్టలు చేసుకున్నురా —' ఆర్విల్ నవ్వుతూ అన్నాడు.

వాళ్ళు కట్టినదారం తెగింది. అంచేత ఆ రెండు పటాల ఊపుకు ఆగలేకపోయింది. మధ్యలో ఎక్కడో అది తెగిపోయింది. ఆ పటాలు రెండూ గాలిలో పక్షుల్లాగా అంతులేకుండా ఎగిరిపోయాయి. అవి మళ్ళీ కనుపించలేదు.

# విల్బర్‌కి జబ్బు చేసింది

విల్బర్‌గానీ, ఆర్విల్‌గానీ ఎప్పుడూ ఇవిచేయటంతోనే కాలం గడుపుతున్నారనుకొంటున్నారా? వాళ్ళకు ఇతరపనులు కూడా చాలవున్నవి. విల్బర్ ఇప్పుడు హైస్కూల్లో చదువు తున్నాడు. ఆ స్కూల్లో హరిజాంటల్ బార్ (అంటే రెండు స్థంభాలు భూమిలోపాతి వాటిపైన అడ్డంగా ఒకకొయ్య బిగి స్తారు. పిల్లలు దీనిని పట్టుకొని బస్కీలు తీసినట్టు క్రిందికి-పైకి ఊగుతుంటారు. వీటివల్ల చేతులకు బాగా బలంవస్తుంది) తెచ్చారు. స్కూల్‌కాగానే రోజూ విల్బర్ వెళ్ళి చాలసేపు దీని మీద వ్యాయామం చేసేవాడు. కొన్నాళ్ళకి దానిమీద చాలబాగా చేయటం నేర్చుకొన్నాడు. ఒక్కబిగిన యాభై బస్కీలు తీయ గలిగేవాడు. అంచేత అతనిచేతులు బాగా బలపడ్డాయి.

ఇలా ఆరునెలలు గడిచేసరికి దానిమీద మిగతావాళ్ళకి చేతగాని పనులుకూడా చేయటం నేర్చుకొన్నాడు. బాగా వూపు దెచ్చుకుని ఎగిరి దానిపై రెండోవైపుకు దుమకటంలో మంచి నేర్పు సంపాదించాడు. ఇదిగాక వాళ్ళస్కూల్లో ఇంకా చాల రకాల ఆటలు-వ్యాయామాలు వున్నాయి. వాళ్ళమేష్టారు విల్బర్‌కి ఇంకా ఏవేవో ఆటలూ అవీ నేర్పాలనుకున్నాడు. కాని విల్బ ర్‌కి ఇదితప్ప మరేదీ నచ్చలేదు.

'దానిమీద అలా చేస్తుంటే గాలిలో ఎగిరిపోతున్నట్టే వుంటుందిరా' అని ఒకనాడు తమ్ముడితో విల్బర్ చెప్పాడు కూడా.

విల్బర్ రోజు రోజుకూ బాగా బలమైన వాడుగా తయారవు తున్నాడు. ఆ రోజుల్లో బస్సులు అనేవి లేవు (అప్పుడప్పుడే హెన్రీఫోర్డు అనేఒకాయన సుర్రాలు తేసంతా సరిచేసింది తయారు చేస్తున్నాడు.) అందుచేత వాళ్ళిద్దరూ రోజూ స్కూలుకు నడిచి పోవలసిందే. వాళ్ళ ఇంటికి స్కూలు రెండుమైళ్ళదూరం ఉంది. ప్రతిరోజు ఇంతదూరం నడిచిపోవటంమూలాన వాళ్ళ కాళ్ళల్లోకూడా మంచిబలం ఏర్పడింది.

విల్బర్ హైస్కూలులో చేరిన మొదటి రోజుల్లోనే ఫుట్ బాల్ (కాలితో తన్నే బంతిఆట) ఆటలో మొనగాడుగా వుండేవాడు. చలికాలంలో హాకీ ఆడుతుండేవాడు. వాళ్ళ స్కూలుకు ప్రక్కనే గడ్డ కట్టిఉన్న చెరువు మైదానంలో స్కూలు ఆటల పోటీలు జరిగాయి. ఒకసారి ఆ సమీపంలోవున్న మిలటరీ ఆఫీసర్ల (సైన్యంలో ఉద్యోగులు) పిల్లలంతా ఒక ముఠాగా వీళ్ళ ముఠాతో ఆడారు. ఏ ముఠాకూడా ఒకరికొకరు తగ్గకుండా ఆడుతున్నారు. అంటే రెండుముఠాలు సమవుజ్జీలన్నమాట. విల్బర్ తన వంతుగోల్ (వలలో పడేలాగా బంతిని తన్నుట) చేశాడు. ఆఫీసర్ల పిల్లల్లో ఒకడు వచ్చేబంతికి కర్ర అడ్డు పెట్టాడు. విల్బర్ పెద్ద వూపుమీదపోయి ఎత్తున్నతాకి బంతిని హాజపైకొట్టాడు.

అందరూ ఆ బంతిచుట్టూ చాలసేపు పెనుగులాడుకొన్నారు. ఇంతలో ఆఫీసర్ల పిల్లల్లో మరొకడు ఆ బంతిని గట్టిగా తన్న బోతే బంతిజారిపోయి ఆ తన్ను సరిగ్గా విల్బర్ నోటిమీద తగి లింది. ఆ దెబ్బతో విల్బర్ నోటినుంచి ఒక్కసారే అయిదు పళ్ళు రాలిపోయాయి. అంతటితో ఇక ఆట ఆపివేశారు. అదృ ష్టంకొద్దీ మిలటరీ డాక్టరొకాయిన అక్కడేవుండి ఆట చూస్తు న్నాడు. అతను వెంటనే విల్బర్ దగ్గరకు పరుగెత్తుకువచ్చి 'అయ్యో పాపం బాగా దెబ్బ తగిలినట్టుందే అబ్బాయ్,' అన్నాడు.

'ఆఁ ఏమీపరవాలేదు లెండి' అన్నాడేగాని ఆ వెంటనే ఒళ్ళు తెలియకుండా పడిపోయాడు. తీసుకుపోయి ప్రక్కమీద పడుకో బెట్టారు. ఇప్పటిలాగా ఆరోజుల్లో 'పెన్సిలిన్' 'సల్ఫాని మీడ్' ఇంజక్షన్ల వంటి మందులులేవు. ఇంత అయోడిన్ గాయంమీద వేసేవారు. అంతే. ఈ మందు విల్బర్ కి పనిచేయ లేదు. అతని గాయాలకి అదేమీ చాల్లేదు. చాలరోజుల దాకా గొట్టాలద్వారా పండ్లరసం పాలులాంటివి మాత్రమే తీసుకుంటూ వుండాలిసి వచ్చింది. ఆ తరువాత చాలరోజులకి మెల్లగా గుడ్డు లాంటి తిండి పెట్టేవాళ్ళు. అయితే ఎందుచేతనో ఈ ఆహారం విల్బర్ కి సరిపడలేదు. దానితో అతనికి కడుపులో ఒకరకమైన నొప్పి వచ్చింది. ఆ తరువాత గుండె బలహీనత ఏర్పడింది. ఇక జీవితం అంతా ఇలా ఎందుకూ పనికిరాకుండా పోతాడేమో అనిపించింది.

చెప్పే మాటలన్నీ విని నవ్వుతూ,' దేవుడు ప్రతివాళ్ళకీ ఏదో ఒకపని వుంచే ఏర్పాటు చేసేవుంటాడు బాబూ.... నీవూ, తమ్ముడూ మీయిద్దరూ నాలాంటి పాదిరీలు అవుతా రనిపించటం లేదు. మీరేమిచేయాలో ? మీరు ఇంతకంటే గొప్పవాళ్ళే అవు తారు లావుంది' అని చెప్పేవాడు.

విల్బర్‌కి కొంచెం కూర్చొనే ఓపిక వచ్చింది. వాళ్ళ నాన్న ఒకనాడు అతనికి కొయ్యమీద చెక్కడు పనిచేసే పని ముట్లు తీసుకొచ్చాడు. అదిచూచి విల్బర్‌కి భలేసంబరంవేసింది. మంచికొయ్య ముక్కలు-పనిముట్లు నాన్న తెచ్చిపెట్టాడు. వాటితోపాటు చెక్కడు పనులకు సంబంధించిన బొమ్మలు, నమూనాలు వేసివున్న పుస్తకం కూడా ఒకటి పట్టుకొచ్చాడు. అందులో అన్నిరకాల కొయ్యలను గురించి వ్రాసివుంది. కొన్ని మెత్తగా వుంటాయి. కొన్ని విరగకుండా ఎంతయినా వంచ వచ్చు. కొన్ని రకాల కొయ్యలు ఎంత మెత్తగా వుంటాయో అంత గట్టిగా వుంటాయి. విల్బర్‌కి ఈ దెబ్బ తగిలి జబ్బే చేయకుండా వుంటే ఇవ్వన్నీ నేర్చుకొనే అవకాశం లేక పోయేదేనేమో!

ఒకనాడు ఆర్విల్, వాళ్ళ అన్నాయ్ దగ్గరకువచ్చి 'అన్నాయ్ విన్నావటరా?' అన్నాడు.

'ఏమిటిరా ?'

'అమ్మకు ఒక కుర్చీ చేసిపెడదాంరా. నీవేమో బొమ్మ గీసిపెట్టు. నేను దొడ్లోకి వెళ్ళి కుర్చీ తయారుచేస్తా. అమ్మకు, నాన్నకు ముందేచెప్పవద్దు-ఏం?' అన్నాడు ఆర్చీ.

ఎప్పుడూ ఇంతే. మొదట ఆర్చీకే ఒక ఆలోచన తడుతుంది. విల్బర్ దానినిగురించి బాగా లోతుగా ఆలోచించుకొంటాడు. ఆ తరువాత ఇద్దరూ దానిని బాగా పరిశీలించుకొంటారు. [illegible]

వాళ్ళ అమ్మకు ఎలాంటి కుర్చీ అంటే ఇష్టమో దాని నమూనా బొమ్మ గీశారు. వాళ్ళ నాన్న తెచ్చిపెట్టిన డ్రాయింగు పెట్టెలో వాళ్ళకు కావలసిన వస్తువులు అన్నీ ఉన్నాయి. వాటితోపాటు అసలు గీయు కాగితము, రకంవారి పెన్సిళ్ళు, గుండ్రంవేయు కంపాసుకూడా వచ్చాయి. వాటితో విల్బర్ బాగా బొమ్మలు వేయటం నేర్చుకొంటున్నాడు. కుర్చీ నమూనా చాలా బాగా కుదిరింది. అది తీసుకొని ఆర్చీ కట్టెలదొడ్లోకి రహస్యంగా వెళ్ళాడు.

విల్బర్ తన మంచంమీదనే కూర్చొని తమ్ముడికి ఎలా చేయాలో అంతా జాగ్రత్తగా చూపుతున్నాడు. కుర్చీ చేయటం తేలికపనిగాదు. కూర్చొనే చెక్కకి నాలుగు గుండ్రని రంధ్రాలు వేయాలి. ఆ నాలుగు రంధ్రాలలోనూ నాలుగు కాళ్ళు బిగిస్తారు. వాళ్ళ నాన్నవద్ద కోసిన కొయ్యముక్కలు చాలా వున్నాయి. వాటిల్లో ఒకటి ముప్పాతిక అంగుళం మందం ముక్క దొరి

కింది. రెండు పాత చీపురుబద్దయుంటే అవిగూడా సరిగా ముప్పా తిక అంగుళం మందమే వున్నాయి. ఇవిపెట్టి ఆర్చిల్ కాళ్ళు తయారుచేశాడు. సరిగ్గా సరిపోయాయి. ఆర్వి ఆ జర్మన్ వడ్రంగి ష్వార్ట్స్ దగ్గరికి వెళ్ళి కొంచెం మక్కు అడిగి పట్టుకొచ్చాడు. అది పెట్టి బాగా ఎండనిచ్చారు. మంచి కుర్చీ తయారయింది. దానికి ఆనుకొనే భాగం తయారుచేశారు. దానికి ఆర్వి బాగా రంగు పూశాడు.



ఆ మరునాడు ఉదయం వాళ్ళ అమ్మ వంటయింట్లోకి వెళ్ళేసరికి అక్కడ కొత్త కుర్చీ కనపడింది. ఆమెకు అది కొడుకులు యిచ్చిన మొదటి బహుమతి. అయితే యిదివరకు చాలసార్లు క్రిస్టమస్ పండక్కి, పుట్టినరోజు పండుగలకీ చాల బహుమతులు తెచ్చి ఇస్తుండేవాళ్ళు. కాని అవి వేరు-ఇది వేరు. ఇది సొంతంగా వాళ్ళ చేతులతో తయారుచేసింది.

విల్బర్ జబ్బుగా వున్నప్పుడు కూడా ఒక్క పనితో వూరుకొనేవాడుకాదు. మంచంమీద పడుకొని ఎన్నో పుస్తకాలు చదువుతుండేవాడు. అదివరకు స్కూలు పాఠాలుతప్ప ఇతర పుస్తకాలేవీ చదివేవాడు కాదు. అతనికి యిప్పుడు చదవటం అంటే యేమిటో తెలిసింది. పుస్తకాలలో కూడా ఎంత తమాషాలు వుంటాయో అర్థమయింది. చాల పుస్తకాలు చదివాడు. వాటిల్లో 'రాబిన్‌సన్ క్రూసో' అనే పుస్తకం అంటే అతనికి ఎంతో యిష్టం - ఎందుకనుకున్నారు? రాబిన్‌సన్ యెక్కడా ఏమీదొరకని ఒక ద్వీపం (లంక)లో దిగాడు. అక్కడ అతనికి ఏమీ దొరకలేదు. తనకు కావలసిన ప్రతిదీ తానే తయారు చేసుకోవలసి వచ్చింది. ఒక తెప్ప, గుడిసె, బట్టలు, పనిముట్లులూ ఒకటేమిటి? అన్నీ తయారుచేసుకొన్నాడు. అతనికే గనక అవన్నీ చేసుకోవటం చేతగాకపోతే చచ్చిపోయేవాడే గదా !

విల్బర్ మంచంమీద పడుకొని తాను, తన తమ్ముడు ఒక ఎడారిదీవిలో వున్నట్టు వూహించేవాడు. అయితే వాళ్ళకూ వస్తువులు తయారుచేయటం తెలుసుగనక ఏమీ ప్రమాదం వుండదనుకునేవాడు తానూ ఆర్వీ ఎప్పుడయినా గొప్పవాళ్ళం అవుతామనుకొనేవాడు. మళ్ళీ 'ఇవన్నీ ఒట్టి కలలే, నిజం కావచ్చాయా?' అని తనలో తానే అనుకొనేవాడు. ఒక్కొక్కప్పుడు కలలుకూడా నిజం కావచ్చునని అప్పుడు అతనికి

తెలియలేదు. కొంచెం సహాయం చేసేవాళ్ళు వుంపేచాలు. అవే జరుగుతాయి.

ఆర్వి మాత్రం ఎప్పుడూ చదివేవాడు కాదు. ఇతరుల ఆలోచనలను గురించి చదవటం అతనికి యిష్టం వుండేదికాదు. తన ఆలోచనలేవో తనకు వున్నాయి. అతనికి కావలసింది అంతే. ఎప్పుడూ పుస్తకాలు చదువుతూ కూర్చుంటే ఇక పనులు చేసే దెప్పుడూ ?

ఒకసారి ఆర్వి, ఎడ్వర్డుతో భాగం కలిసి పుస్తకాలు అచ్చువేసే ప్రెస్సు ఒకటి కొన్నాడు. వీళ్ళిద్దరూ అపుడు ఆరవ ఫారము చదువుతున్నారు. 'మిడ్జెట్' అనే స్కూలు పత్రిక నడపాలని వాళ్ళ ఆలోచన. వాళ్ళ ప్రెస్సు వేరే పత్రికకు కూడా పెట్టుకున్నారు. వాళ్ళ ప్రెస్సు సిగరెట్టుపెట్టె అంత చిన్నది. ఆ పత్రికయు అంత చిన్నదే.

అయితే ఏం ? వాళ్ళు దాన్నే నడిపారు. వాళ్ళతో చదివే పిల్లల్ని గురించే వ్రాసేవాళ్లు. అది వాళ్ళే అచ్చువేసేవాళ్ళు. వాళ్ళ వూళ్ళోవున్న పాతసామానుల వర్తకుడు, వడ్రంగి, కసాయిదుకాణం (మాంసం అమ్మేచోటు) లాంటివాళ్ళను తమ పత్రికకు ప్రకటనలు (అడ్వర్టయిజ్‌మెంట్లు) ఇవ్వమని అడుగు దామనుకున్నారు. ఒక్కొక్క ప్రకటనకు పదిహేను సెంట్లు (ముప్పావలా) చెల్లించుకోవాలి. అడిగినవాళ్ళంతరూ ప్రకటనలు యిచ్చారు. వాళ్ళ చిన్నప్రెస్సు ఒక చిన్న పేపరుమాత్రం అచ్చువేయగలదు.

'మా అన్నాయ్‌కి నయం కానివ్వవోయ్! మనమే సొంతంగా పెద్ద ప్రెస్సు తయారుచేసుకోవచ్చు' అని ఆర్వీ ఎడ్వర్డుతో అంటూ వుండేవాడు.

'అబ్బ నీ కేమిపిచ్చి?' అన్నాడు ఎడ్వర్డు.

'ఏయ్, చేయకేమోయ్? స్లెడ్జి చేశాం, గాలిపటం చేశాం, కుర్చీ చేశాం, ప్రెస్సు మాత్రం చెయ్యలేమనుకున్నావా? చూస్తుండు—చేస్తామో లేదో?' అన్నాడు.

విల్బర్ యిప్పుడిప్పుడే కొంచెం లేచి తిరుగుతున్నాడు. చాల బలహీనంగా వున్నాడు. రోజూ స్కూలుకు రెండుమైళ్ళ దూరం నడిచే ఓపికలేదు అతనికి. అందుకని అతనిని స్కూలుకు పంపటమే మానివేయాలనుకున్నారు వాళ్ళ అమ్మ నాన్న.

ఆ రోజుల్లో వాళ్ళనాన్న 'క్రిష్టియన్ కన్సర్వేటర్' అనే ఒక చర్చి పత్రికకు సంపాదకుడుగా వుండేవాడు. అందులో విల్బర్‌కి ఒకపని యివ్వాలనుకున్నాడు. పత్రిక అచ్చు అయి రాగానే వాటిని మడచి పైన అడ్రసులు అంటించటం అతను చేయవలసిన పని. ఆ పత్రిక్కి చాలమంది చందాదార్లు వుండేవారు. అంచేత విల్బర్ ప్రతివారం చాలసేపు ఇవన్నీ మడిచి పెట్టవలసి వచ్చేది. తరువాత ఆర్వీ కూడా అన్నాయ్‌కి తోడుగా పనిచేసిపెట్టేవాడు. కాని అతనికి యీపని నచ్చలేదు. స్వారస్యం లేనిదిగా ఉండేది.

'ఈ మడిచేపని చెయ్యటానికి ఒక యంత్రం తయారు జేస్తే మంచిదిరా అన్నాయ్' అన్నాడు ఆర్వీ.

'మడిచే యంత్రమా? ఈ పేరు నే నెక్కడా వినలేదే?' విల్బర్ ఆశ్చర్యంగా అన్నాడు.

'నేనూ వినలేదులే. అయితే ఏం? మనం ఏదో ఒకటి చేస్తాం. నేను చెబుతున్నాగా....?' అన్నాడు ఆర్వీ.

'ష్వార్ట్స్ (జర్మన్ వడ్రంగి) దగ్గర ఒక తరిమెన వుంది. కాలితో తొక్కుతుంటే అది తిరుగుతుంటుంది. అదీ....' విల్ ఆలోచిస్తూఅన్నాడు.

'ఆ అచ్చు ఆఫీసు వెనక బోలెడంత పాతసామాను పడివుంది. అక్కడ రోలర్లుకూడా ఉన్నాయి. అవి గనక తెచ్చామా....' ఆర్వీ అన్నాడు.

ఆ రాత్రి అంతా వంటయింట్లో బల్లదగ్గర బొమ్మలు గీస్తూనే ఉన్నారు. ఆర్వీ అంతలోనే ఏదో కొత్త ఆలోచన చెబుతాడు. విల్బర్ అందులో ఉన్న పొరపాట్లు చెబుతుంటాడు. ఏ పొరపాటూ కనబడకపోతే అలా చేయటానికి మొదలు బెడ తారు. మెల్లగా ఏదో వింతనిచ్చు యంత్రం నమూనా బొమ్మ గీశారు. ఇంత కష్టమైన పని వాళ్ళు యింతకు ముందెప్పుడూ చేయాలనుకోలేదు. ఇదంతా ఇనుముతో చేసేపని. చాల కష్ట పడాలి. మూడు వారాలనాటికి ఒక యంత్రాన్ని భాగాలు దొరికి నంతవరకు తయారుచేశారు.

ఈ పని ఆ పిల్లలు గనుక చేయగలిగారుగాని మరొక రయితే చేయటం కష్టమే. విల్బర్ కాలితో యంత్రం తొక్కుతూ దానిని తిప్పుతుంటే ఆర్వి దానికి కాగితాలు అందిస్తున్నాడు. అనుకొన్నట్టు కాగితాలు మడిచే యంత్రం తయారు చేశారు.

వాళ్ళ నాన్న అదిచూచి విస్తుపోయాడు. ఇదివరకు పత్రికలన్నీ మడవటానికె వాళ్ళిద్దరికే రెండు రోజులు పట్టేది. తమాషాగా కనపడే యీ యంత్రం యిప్పుడు ఆ పని అంతా రెండు గంటల్లో చేసివేస్తోంది.

ఆయన కొడుకులిద్దరివేపు తృప్తిగా చూస్తూ 'బాబూ నీవు జబ్బులో ఉన్నప్పుడు నేను చెప్పలేదు. భగవంతుడు మీ యిద్దరికీ ఏదో పని నిర్ణయించి వుంటాడని: ఇదుగో యిలాంటి గొప్ప సంగతులు చేయమనే దేవుడు మిమ్మల్ని కోరుతున్నాడు. కొత్త కొత్తవి తెలుసుకొని తయారుచేసి యీ ప్రజలందరికే మేలు చేయాలని వుంది. ఇకముందు కూడా మీరు యిలాంటివే చేస్తారు బాబూ' అన్నాడు.

'మేం ఏదయినా చేసేస్తాం. ఇదేమిటి ? అచ్చుయంత్రం కూడా చేస్తాం నాన్నగారూ' ఆర్వీ అన్నాడు.

'మనం అన్నీ చేయలేంరా-ఎవరూ చేయలేనివి తయారు చేయటానికి ప్రయత్నం చేయగలం' అన్నాడు విల్బర్ తమ్ముడి మాటకి అడ్డువచ్చి.

'మనల్ని కూడా పైకి మోసుకుపోయేటంత పెద్ద గాలి బుట్ట చేస్తాం అన్నాయ్' మళ్ళీ ఆర్వీ అన్నాడు.

'మీరు అబ్బాయిలు - పక్షులు గాదుగా!' వాళ్ళ నాన్న నవ్వుతూ అన్నాడు.

'కాదు నాన్నగారూ! ఆర్వీ అన్నది నిజమే. ఎప్పుడో ఒకనాడు మేం ఎగిరిపోతాం. నిజమే నాన్నగారూ' విల్బర్ అన్నాడు.

వాళ్ళ నాన్న వూళ్ళకు వెళ్ళి తిరిగి వస్తూ ప్రతిసారీ వాళ్ళకి ఏవో ఆడుకునే వస్తువులు తీసుకువస్తుండేవాడు. ప్రతి సారీ కాథరీన్ (వాళ్ళ చెల్లాయి)కి ఒక బొమ్మ, విల్బర్‌కి ఒక పుస్తకం తప్పకుండా తీసుకురావాల్సిందే. ఆల్ఫ్రెడ్‌కి మాత్రం 'సిపాయి బొమ్మలు' అంటే చాలా యిష్టం. అతనివద్ద సిపాయీల బొమ్మలు, అలాంటివి చాలా ఉంటాయి. అతను యీ బొమ్మలన్నిటినీ నేలమీద వరుస తీరుగా నిలబెట్టి వాటిచేత 'యుద్ధాలు' చేయిస్తూ వుంటాడు. ఇప్పుడంటే కాస్త పెద్దవాడయ్యాడుకదా. ఇంకా అలా బొమ్మలాటలు ఏమి ఆడుకొంటాడు! అందుకే ఆల్ఫ్రెడ్‌కి ఏమి కొనుక్కొద్దామా అని ప్రతిసారీ ఆలోచించాల్సిందే. ఎందుకంటే ఏది తెచ్చినా ఆల్ఫ్రెడ్‌ని ఒప్పించడం భలే కష్టం.

ఒకసారి వాళ్ళ నాన్న టౌనునుంచి వస్తూ వస్తూ ఏదో కొత్తరకం బొమ్మ ఒకటి పట్టుకొచ్చాడు. మామూలు బొమ్మలు, అవి అయితే ఆల్ఫ్రెడ్‌కి నచ్చుతుంటాయి కాని యిది అలాంటిది కాదు. దానిపేరు 'హెలికాప్టర్' అంటారు. ఇదేదో కొత్తరకం బొమ్మ. వెదురుబద్దలతో అందంగా తయారుచేశారు. పైకి ఉల్లిపొరకాగితం

అంటించి వుంది. దానికి పడవకు వుండే 'తెడ్లు' లాంటివి రెండు ప్రక్కలా రెండు పెట్టి ఉన్నాయి. ఈ రెంటినీ గుండ్రంగా త్రిప్పవచ్చు కూడా. వాటికి రబ్బరు దారం కట్టివుంది.

'ఇది యిక్కడ కాదులే బయటికి రండి చూపుతా' అన్నాడు వాళ్ల నాన్న. అప్పుడు వాళ్ళ అమ్మకూడా వుంది.

విల్, ఆర్వి యిద్దరూ దీనిని జాగ్రత్తగా చూస్తున్నారు. ఇది చూస్తుంటే వాళ్ళకి ఆశ్చర్యంకంటే దీనిని ఎలా తయారు చేశారా అన్న ఆలోచనే ఎక్కువగా పట్టుకుంది. ఇది యేం చేయాలో కూడా వాళ్ళకి అంతుపట్టటంలేదు. వాళ్ళ నాన్న వెంట అది ఏంచేస్తుందో చూడటానికని బయటికి వెళ్ళారు. వాళ్ళ నాన్న దానికి ప్రక్కనవున్న రెండు 'తెడ్లు' లాంటివి బాగా త్రిప్పి (కీ యిచ్చి) వదిలిపెట్టాడు. అది రివ్వున సరాసరి పదిహేను అడుగులు పైకి యెగిరి కొంతదూరం పోయి మళ్ళీ క్రిందపడింది.

'ఓం ఓం గబ్బిలము యెగిరినట్టుందేంరా అన్నాయ్' ఆర్విల్ హుషారుగా అన్నాడు. విల్‌కి ఇది వింతగా కనపడింది.

'తోకలేని గాలిపటంలా వుంది' అన్నాడు.

వాళ్ళ నాన్నకు దానిసంగతి అంత బాగా తెలియదు. అది కొన్నచోట వాళ్ళు దీనిపేరు 'హెలికాప్టర్' అని చెప్పారట.

'హె....లీ... కా....ప్....ట....ర్ర్' ఆర్విల్ సాగ దీస్తూ అన్నాడు.

'ఆ మాట గ్రీకుభాషలోది బాబూ-'హెలీకో' అంటే చుట్టలు చుట్టలుగా వుండేది, 'ప్టర్' అంటే 'రెక్క' అని అర్థం.' అని వాళ్ళ నాన్న దాని అర్థం చెబుతుంటే యీ లోపల విల్బర్ దానికి మళ్ళీ 'కీ' ఇచ్చేసరికి అది బుర్రున పిట్టలాగా ఎగిరి పోయింది. ఇదే యింకా ఎవరయినా ఇతర పిల్లలయితే 'అబ్బ! ఎంత వేగంగా పోతుంది? అమ్మహాయ్ ఎంత పైకి పోయింది?' అనుకొని కొంచెంసేపు ఆడుకుని అవతల పారవేసేవాళ్ళే. విల్బర్, ఆర్వీ మాత్రం అలాకాదు. ఏదయినా కొత్తది చూచా రంటే ఇక దాని అంతు తెలుసుకోకుండా ఊరుకొనేవాళ్ళుకాదు. 'ఇది ఎలా ఎగురుతుంది?' అనే ప్రశ్న వాళ్ళను పట్టుకుంది. దానికి ప్రక్కలను వున్న రెండు రెక్కలు ఒకొక వేపుకూ యిదొక వేపుకూ తిరుగుతున్నాయి. ఇదే మరీ తమాషాగా కన పడింది.

'ఇది యిలా సరాసరి పైకి ఎగురుతోందంటే, గాలిలో గుండా ఒక రంధ్రం చేసుకున్నట్టుగా దూరిపోతోందన్నమాట' అన్నాడు విల్బర్.

'లేకపోతే పడవకు ఉండే తెడ్లు నీళ్ళను ప్రక్కకు త్రోసివేసినట్లే దీని రెక్కలు కూడా గాలిని ప్రక్కకు నెట్టి వేస్తుంటాయేమో!' ఆర్విల్ అన్నాడు.

ఆ హెలికాప్టర్ అంతా విప్పి చూచారు. మళ్ళీ బాగాచేసి ఎగరవేశారు. మళ్ళీ బాగానే ఎగిరింది. ఇది యిలా సరిగ్గా

పైకి యెలా యెగురుతుందో వాళ్ళకి అర్థంకాలేదు. ఇది పిట్టలా గాని, గాలిపటంలాగాని యెగరటంలేదు. సరాసరి నిటారుగా పైకి ఎగిరిపోతోంది. ఆ రోజుల్లో పెద్ద పెద్ద విజ్ఞాన శాస్త్రాలు తెలిసినవాళ్ళంతా ఆలోచించే ఇంత పెద్ద సంగతులను గురించే యీ అన్నా తమ్ముడు యిద్దరుగూడా ఆలోచిస్తున్నారు. అంటే తనే ఇదేమీ తోచటంలేదు. అంతా గొడవ గొడవగా వుంది. రోజూ దీనిని ఎగరవేసి చూస్తూ వుండేవాళ్ళు. ఒకనాడు మామూలుగానే యెగరవేశారు. అది రివ్వున యెగిరిపోయి వాళ్ళ ఇంటిముందు వున్న ఒక చెట్టు కొమ్మను కొట్టుకొని పగిలిపో యింది. మళ్ళీ బాగుచేయాలని వాళ్ళు యెంత తంటాలుపడ్డా అది బాగుకాలేదు. అయితే 'హెలికాప్టర్' పేరుగాని దాని ఆకారంగాని వాళ్ళు యెప్పటికీ మరచిపోలేదు.

ఇది ఎంత గొప్పదయినా ఇతరులు ఎవరో తయారుచేసిన వస్తువుకదా ! వాళ్ళకు ఇతరులు చేసిన వస్తువులంటే లెక్క వుండేదికాదు. వాళ్ళు తయారుచేస్తేనే వాళ్ళకి బావుంటుంది. తన కొడుకు లిద్దరిలోనూ యేదో విశేషం వుందని వాళ్ళ నాన్నకు తెలుసు. కనుక వాళ్ళని బాగా ప్రోత్సహించేవాడు. వాళ్ళ అమ్మ కూడా అంతే.

'ఏమమ్మా మీ పిల్లలు యెప్పుడూ బయటికి వచ్చి ఆడు కున్నట్టే కనపడదే. యేంచేస్తుంటారేమిటీ ?' అని పొరిగింటి అమ్మలక్కలు అడిగేవాళ్ళు.

'కట్టెలదొడ్లో యేమిటో చేస్తున్నారమ్మా!' అంటూ నవ్వుతూ సమాధానం చెప్పేది.

వాళ్ళు నిజంగానే ఎప్పుడూ ఆ కట్టెలదొడ్లో కూర్చొని యెదో చేస్తూనే వుంటారు. ఆర్విల్ ఒకనాడు ఎడ్విస్తుతో తాసూ, విల్బరూ నిజమైన అచ్చుయంత్రాన్ని తయారుచేశామని చెప్పారు. పెద్దదయినా చిన్నదయినా పనిచేసే పద్ధతి ఒకటేగదా! వాళ్ళ దగ్గరవున్న చిన్న అచ్చు యంత్రం అంతా బాగా పరికించి చూచారు. దానికి ఇరవైరెట్లు పెద్దదిగావుండే అచ్చుయంత్రం తయారుచేయాలనుకొన్నారు. ఇప్పుడు దొడ్లో ఆ పనిలోనే వున్నారు.

కార్మొడి పాతసామానుల కొట్లో వీళ్ళకి కావలసినవన్నీ తెచ్చుకుంటారు. అక్కడ యెవరికీ పనికిరాని వస్తువులు ఎన్నో వుంటాయి. అవి ఇంకెవరికీ దేనికీ పనికిరావు. అంచేత వీళ్ళకు అడగగానే అతను ఇస్తూ వుంటాడు. వాళ్ళకు కావలసినవన్నీ తెచ్చుకొనేవాళ్లు. తుప్పు అంతా జోగొట్టి బాగా మెరిసేట్లు చేసే వాళ్ళు. ఒకనాడు ఆ చుట్టుపట్ల అంతా వెతికి వెదల్పుగావుండే నాపరాయి ఒకటి సంపాదించారు. దానిమీద అచ్చు అక్షరాలు పేర్చుకొంటారు.

అయితే అక్షరాలు యెలా చేయాలో వాళ్లకి తెలియలేదు. అవి కొనాలిసిందే. కొనాలంటే కనీసం పదిహేను డాలర్లు (యాభై రూపాయలు) అయినా కావాలి. వాళ్ళదగ్గర పది డాలర్లు మాత్రం వున్నవి. అవి వాళ్ళు కష్టపడి సంపాయించు

కొన్నారు. వాళ్ళ అమ్మను అడిగి మిగతా అయిదు డాలర్లు అప్పు పుచ్చుకున్నారు. ఇదివరకే అచ్చుయంత్రాలు వున్నాయి. కొన్ని వేలసంవత్సరాలకు పూర్వమే చైనాదేశంలో అచ్చు యంత్రాన్ని కనిపెట్టారు. 1454 సంవత్సరందాకా యిరోపా దేశంలో దీని సంగతి తెలియనే తెలియదు. ఆ సంవత్సరమే జోహాన్ గూటెన్‌బెర్గు అనే జర్మనీదేశపు ఆయన ఒకరు మొదటిసారిగా తన అచ్చు యంత్రంతో చలించు అక్షరాలతో బైబిల్ గ్రంథం అచ్చువేశాడు. అప్పటినుంచి అతనే మొదటి అచ్చు యంత్రం కనిపెట్టినట్లు చెబుతుంటారు. అతను కనిపెట్ట లేదు. కాని దానిని అతను బాగా వుపయోగంలోకి తెచ్చి పుస్తకం అచ్చువేశాడు. విల్బర్ సోదరులు సొంతంగా ఒక యంత్రం తయారుజేసుకొన్నారు.

వీళ్ళు తయారుచేసింది కూడా చూడటానికి గూటెన్‌బెర్గు చేసిన దానిలాగానే వుంటె. ఇదీ దానిలాగానే పనిచేస్తుంది. అక్ష రాలన్నీ పేర్చి ఒక 'బెడ్' అనబడు చదును పెద్ద రాతి పలక మీద కదలకుండా పెడతారు. దానిపైన సిరా పూస్తారు. దాని మీద ఒక కాగితం పరచి రోలరుతో రుద్దుతారు. 'రోలరు' అంటే గుండ్రంగా తిరుగుతూ వుంటుంది. కాగితంమీద ఆ అక్షరాలన్నీ అచ్చుపడతాయి. అయితే ఈ విధంగా చాలా ప్రతులు తయారుచేయాలంటే ఎంతో పైము పడుతుంటె.

కాని విల్బర్, ఆర్వీలకి మాత్రం ఇది యేమంతగా నచ్చలేదు. ఇంకా బాగా వుండాలని వాళ్ళ కోరిక. కాలితో

త్రొక్కటానికి వీలుగా ఆ యంత్రానికి అడుగు భాగాన వొక పిడిలాంటిది బిగించారు. వాళ్ళ అమ్మ రోజూ దుస్తులు కుట్టుకునే మెషిన్ యెలా పనిచేస్తుందో చూచారు. ఆవిడ కుడికాలితో త్రొక్కుతుంటే ఆ మెషిన్‌సూది క్రిందకీ పైకి చాలా వేగంగా తిరుగుతూ వుంది. అదేగనుక చేత్తో పట్టాలంటే వాళ్ళ అమ్మకు యెంతో శ్రమ పట్టేది. ఈ మెషిన్ వేగంవల్ల చాలా త్వరగా కుట్టివేయటానికి వీలవుతున్నది. కొన్ని గంటలు పట్టేపని కొన్ని నిముషాలల్లో అయిపోతూంది.

అది చూచే వాళ్ల అచ్చు యంత్రానికి కూడా అలాంటిదే త్రొక్కుడు యేర్పాటు చేశారు. పైన అక్షరాలకు సిరా పూసే రోలరుకి ప్రక్కను పుల్లీ చక్రాలు పెట్టారు. ఇప్పుడు అది చాలా వేగంగా వెనక్కూ ముందుకూ తిరుగుతోంది. విల్బర్ త్రొక్కుతుంటే ఆర్వీ కాగితంపెట్టి దానిమీద అక్షరాలు ముద్ర పడగానే మళ్ళీ రోలరు వెనక్కుపోయి తిరిగి అక్కడికి వచ్చే లోపల అచ్చుపడిన కాగితం తీసి మరో కాగితం పెట్టటం- మళ్ళీ అది తీసి యింకొకటి పెట్టటం [illegible] చేస్తుంటాడు. అప్పు డప్పుడు త్రొక్కటం ఆపి రోలరుమీద సిరా పేస్తూవుంటారు.

ఎలాగయితే ఏం వాళ్ళు అచ్చు యంత్రం పూర్తి చేశారు. అది బాగా పనిచేసింది. అయితే అసలు అచ్చు వేయ టానికి ఏమీ లేనప్పుడు అచ్చు యంత్రం వుండి ఉపయోగం యేమిటి ?

# సొంత వారపత్రిక

'మనం ఒక వారపత్రిక నడుపుదాంరా అన్నాయ్' అన్నాడు ఆర్విల్.

'డబ్బులేవీ మనకి?' విల్బర్ దిగులుగా సమాధాన మిచ్చాడు. వాళ్ళ నాన్న కొత్తగా పసిఫిక్ తీర ప్రాంతపు బిషప్ అయ్యాడు. అందుచేత ఆయన అదివరకు నడుపుతూ వుండిన మతవిషయాల పత్రికను ఆపివేసి వెళ్ళవలసి వచ్చింది. ఆ పత్రిక వున్నప్పుడు అది మడిచి పేళ్ళు అందించినందుకు వాళ్ళ నాన్న ఇద్దరికీ వారానికి చెరొక రెండు డాలర్లు (ఇప్పటి వెల పది రూపాయలు) ఇస్తూవుండేవాడు. ఇప్పుడు అది ఆగిపోతే ఇక ఆ డబ్బులుకూడా రావు.

'మనకు సొంత పత్రిక వుంటే ప్రకటనలు సంపాయించవచ్చులే అన్నాయ్. ఇప్పుడు నేను, ఎడ్వర్డు మా బడి పత్రిక్కి తెచ్చుకోలేమా? అలానే చేశామంటే మనకి బోలెడు డబ్బులు వస్తాయి' ఆర్విల్ ధైర్యం చెప్పాడు.

'అదిసరే. మొదట కాగితం, సిరా కొనటానికి డబ్బు? ఇంకా కొన్ని అక్షరాలు కూడా కావాలిసివుండె?' విల్బర్ అన్నాడు.

'అమ్మనెలా అడుగుతాంరా! ఇప్పటికే మనం అయిదు డాలర్లు బాకీ వున్నామాయే' ఆర్విల్ అన్నాడు.

'సరే, నేను చిల్లరకొట్టు అతనికి సరుకులు మోసిపెట్టి డబ్బులు సంపాయిస్తాను. నీవూ ఎడ్వర్డు వెళ్ళి పాతసామానులు తెచ్చి కార్మోడికి ఇస్తే ఆయన డబ్బులు ఇస్తాడుగా!' విల్బర్ చెప్పాడు.

'ఈ వేసంగి అంతా పనిచేస్తే ముప్ఫయి డాలర్లయినా నిలవ చేయొచ్చు. మరి డాక్టరుగారు నన్ను గట్టిపనులేమీ చేయొద్దన్నారుగదరా అన్నాడే' ఆర్వి అన్నాడు.

'చిన్న సరుకులు మోయటం కష్టమేమీ కాదులే' విల్బర్ అన్నాడు.

'డాక్టరుగారు బరువు పనులేవీ చేయొద్దన్నారుగా. అందు కని యేం చేద్దామంటే నీవేమో ఆ పనికి ఒప్పుకో, ఇద్దరం కలిసి చేద్దాం. మన పాత పెట్టెబండి వుందిగా, ఆ సరుకులన్నీ అందులో వేసుకొని లాక్కుపోవచ్చు' అని ఆర్వి ఉపాయం చెప్పాడు.

అలానే చేశారు. వాళ్ళ అన్నా తమ్ముడూ ఇద్దరూ ఒక రంటే ఒకరు చాల బాగా వుంటారు. ఎక్కడ్డూ వాళ్ళందరితో కూడా బాగానే కలిసి మెలిసి వుండేవాళ్ళే. కాని అందరికంటే అన్నా తమ్ముడూ ఇద్దరే ఎక్కువగా కలిసి పనులు చేసుకుంటూ వుంటారు. మరే పిల్లలకీ తెలియని సంగతులెన్నో వీళ్ళిద్దరూ

చెప్పుకుంటూ వుండేవాళ్ళు. పెద్దైనంతి యాడ్చుకుపోయా ఎన్నో మాటలు చెప్పుకొంటారు. వాళ్ళు తయారుచేసిన గాలిపటాలని గురించి చెప్పుకొంటారు. వాళ్ళ అమ్మ నేర్పిన 'ఎదురుగాలి' గురించి ఆలోచించేవాళ్ళు. వాళ్ళ నాన్న తీసుకొచ్చిన ఆ హెలికాప్టర్ బొమ్మ ఎలా ఎగురుతుందా అని చర్చించుకొనేవాళ్ళు. అప్పుడప్పుడే కొత్తగా వస్తున్న సైకిళ్ళను గురించి మాట్లాడుకొనేవాళ్ళు.

'మనంగూడా రెండు సైకిళ్ల తయారుచేసుకుంటే బావుంటుందిరా అన్నాయ్' ఆర్వి అన్నాడు. సైకిళ్ళు చాల ఖరీదు వుండేవి. పాతవి కూడా ఎంతో డబ్బుపెడితేగాని రావు. వాళ్ళ నాన్న ఒక్క సైకిలు కూడా కొనలేక పోతున్నాడు.

'మన పత్రిక రానీ. పత్రిక అమ్మటానికి మనకు సైకిలు వుంటే మంచిదికదూ? పాత సైకిలు భాగాలు దొరుకుతాయేమో వెదుకుదాం. అలాంటివన్నీ సంపాయిస్తే ఒక సైకిలయినా తయారుచేసుకోవచ్చుగా' విల్బర్ చెప్పాడు.

ఇద్దరూ ఎక్కడయినా పాత సైకిల్ సామానులు దొరుకుతాయేమోనని కనిపెట్టి వుంటున్నారు. అప్పుడొకటి అప్పుడొకటి ఇలా ఒక్కొక్క సామాను వెతుక్కొచ్చి పాతసైకిల్ ఫ్రేము, బిగించగల ముందు చక్రం, హాండిల్‌బారు పలుచోట్లకొని కట్టెలదొడ్లో దొంతి పెడుతున్నారు. అన్నీ దొరికితే సైకిలు తయారుచేయాలని వాళ్ళ ఆలోచన.

వెన్న, కోడిగుడ్లు, రొట్టె, పిండి ఇలాంటి సరుకులన్నీ తీసుకుపోయి అమ్ముకొస్తున్నారు. అంచేత ఆ ఊళ్ళో అందరికీ వీళ్ళు తెలిసిపోయారు. 'బిషప్‌గారి అబ్బాయిలు' అంటూ వుండే వాళ్లు. చాల మంచివాళ్ళు. వాళ్ళపనేమో వాళ్ళేమో - ఇతరుల సంగతులు పట్టవు. వాళ్ళిద్దరే ఉన్నప్పుడునవ్వు ఎక్కువగా నవ్వటంగాని, అనవసరంగా మాట్లాడటంగాని వాళ్ళకు అల వాటు లేదు.

'మనం పత్రిక పెడితే ఇక్కడి మనుష్యుల్ని గురించి కథలు వ్రాయాలి. అందుకని వీళ్ళని చూస్తూ వుండాలి. చూచి నవి మరచిపోరాదు' అని విల్బర్ తమ్ముడికి చెప్పాడు. రైతుల ఇళ్ళల్లో సరుకులు ఇచ్చి రావటానికి వెళ్ళినప్పుడు ఫలానా పుల్లయ్యగారి కోడి చాల ఎక్కువ గుడ్లు పెడుతుందనీ, యల్లయ్యగారు కొత్త గిత్తనికొని తెచ్చారనీ అనుకొంటుంటే వినేవాళ్ళు. పెదకాపుగారి అమ్మాయికి ఉబ్బసం తగ్గు అంటే అది మరచిపోయేవాళ్ల గాదు. ఊళ్ళోకి ఎవళ్ళయినా కొత్త సంసారం వస్తే వాళ్ళను గురించి వివరంగా తెలుసుకొనేవాళ్లు. ప్రతివారం రావలసిన డబ్బులు తెచ్చుకొని వాళ్ళ నాన్న డ్రాయరులో జాగ్రత్తగా దాచుకొనేవాళ్ళు. ఈసారి వేసంగిలో వనభోజనాలకు వెళ్ళటం తగ్గించివేశారు. ఇప్పుడు వీళ్ళకి వాటి మీద అంతగా పట్టటంలేదు. వాళ్ళ వారపత్రిక పెట్టుకోవటానికి కావలసిన డబ్బులు ఎలా సంపాయించుకోవటమా అన్నదే

వాళ్ళ రంధి. ఆ వేసవి అయ్యేటప్పటికీ చాలా డబ్బులు నిలవ జేశారు.

ఇక వారపత్రిక నడపవచ్చు. వాళ్లు విన్న కథలన్నీ కాగితాలమీద వ్రాసి వాటిని అచ్చు అక్షరాలతో కూర్చిపెట్టారు. వాళ్ళకి ఇప్పుడు చెల్లాయికూడా కొంచెం సహాయం చేస్తోంది. ఎడ్వర్డుకి కూడా భాగం యిచ్చి వాళ్ళతో కలుపుకున్నారు. వాళ్ళ కొత్త వారపత్రికకి 'పడమటి వార్తల పత్రిక' అని పేరు పెట్టుకున్నారు. మొదటి పత్రిక యింటికి వచ్చిననాడు వాళ్ళకి భలే సంబరంగా వుంది. వాళ్ళ పని వాళ్ళకే గర్వం కలిగించింది.

విల్బర్‌కి ఇప్పుడు ఇరవై వొక్క సంవత్సరాలు. అతను పత్రికకి సంపాదకుడు. ఆర్వికి పదిహేడో యేడు. అతను పత్రిక జమాఖర్చులు లెక్కలువ్రాసే మేనేజరుగా వున్నాడు. ఆర్విల్ రోజూ పత్రిక చేతబట్టుకొని ప్రతి వ్యాపారస్తుడి దగ్గరికి వెళ్ళి ప్రకటనలు (అడ్వర్టయిజుమెంట్లు) ఇవ్వమని అడిగి ఇస్తామనిపించుకు వచ్చేవాడు.

ప్రతివారం నూరు పత్రికలు అచ్చువేసేవాళ్లు. ఎడ్వర్డు, ఇంకా ఇద్దరు పిల్లలూ కలిసి యీ పత్రికలన్నీ అమ్ముకు వచ్చేవాళ్ళు. ఇప్పుడు వాళ్లు సొంతంగా పత్రిక నడుపుతున్నారు. రోజూ అచ్చు యంత్రంవద్ద పనిచేస్తూ దాన్ని యింకా బాగా ఉండేలాగా చేయటం ఎలాగా అని ఆలోచిస్తూ వుండేవాళ్ళు.

అచ్చు కూర్పు చాల కష్టమైన పని. ఈ రోజుల్లో (అమెరికాలో) అలాంటి ప్రెస్సులు (అచ్చు వేసేవి) లేవు. అప్పుడప్పుడు క్రిష్టమస్ పండగలకి మాత్రం పిల్లలు ఆడుకోటానికని అలాంటి ప్రెస్సులు తయారుచేసి అమ్ముతుంటారు. కాని పూర్వం అలాంటి వాటితోనే అచ్చు పనులు చేసేవాళ్ళు. అక్షరాలు కూర్చటంలో ఆర్వీ అందరికంటే చురుగ్గా చేసేవాడు. వాళ్ళ అన్నాయ్, చెల్లాయి ఇద్దరూ అతనితో చేయలేకపోయే వాళ్ళు. (చెల్లాయికూడా అప్పుడప్పుడూ చేసిపెడుతూ వుండేదిలే)

ఈ పత్రిక అందరూ బాగా కొంటూవుండేవాళ్ళు. పత్రిక మొదలుబెట్టిన రెండో సంవత్సరానికల్లా వారం వారం వేసే పత్రికల ప్రతుల సంఖ్య నూరునుంచి మూడువందలకు పెరిగింది. ఇప్పుడు దీనిమీద వాళ్ళకి వారానికి పదిహేను డాలర్ల దాకా లాభం వస్తూంది. దానిమీద వచ్చే డబ్బులన్నీ ఒక్క దమ్మిడీ కూడా ఖర్చుపెట్టకుండా దాచిపెడుతున్నారు.

ఇదంతా చూస్తూనే మధ్య మధ్య వీలయినప్పుడల్లా పని చేసి ఒక సైకిలు తయారుచేశారు. చేయటం అంటే కొత్తది కాదు. పాత సామానులు అక్కడొకటి ఇక్కడొకటి పట్టుకొచ్చి అన్నీ కలిపి అతుకులుబెట్టి ఒక సైకిలు తయారుచేశారు. అవన్నీ పాతసామానులే. అంచేత రోజూ ఏదో ఒకటి విరిగిపోతూ వుండేది. అయితేయేం; వాళ్ళు విసుగులేకుండా దాన్ని బాగుచేస్తూ వుండేవాళ్లు. వాళ్ల ఏదైనా చేస్తారు. ఈ పాతసైకిలు చేయటం వాళ్ళకొక లెఖ్ఖలేదు.

ఆర్వీ చాల చురుకైనవాడు. అతనికి ఒకనాడు వొక ఆలోచన తట్టింది.

'మరి చర్చివాళ్ళు ఏవైనా సంచికలు ప్రకటించినా, దుకాణాలవాళ్ళు అమ్మకం నోటీసులు వేయించినా పెద్ద పెద్ద ప్రెస్సుల్లో వేయిస్తుంటారు గదా; వాళ్ళ పనులుకూడా మనమే చేసిపెడితే?' అని విల్బర్‌తో అన్నాడు.

'నిజమే ఆర్వీ. మన పత్రికపని వారంలో రెండు రోజులేగా ఉండేది. మిగతా రోజుల్లో ఎవరి పనులైనా చేసిపెట్టవచ్చు.



వెళ్ళి వాళ్ళెవరైనా ఏమయినా అచ్చుపనులు యిస్తారేమో అడిగిరా' అన్నాడు విల్బర్.

ఆర్విల్ యితర ప్రెస్సులవాళ్ళు వాళ్ళకు ఎంత డబ్బు యిస్తే ఆ పని చేసిపెడతారో తెలుసుకొన్నాడు. వ్యాపారస్తుల

దగ్గరికి వెళ్ళి అందులో సగం డబ్బుకే చేసిపెడతామని చెప్పాడు. సాధారణంగా వర్తకులు వీలయినంత చౌకగా పనులు చేయించుకోవాలని చూస్తుంటారుగదూ? అంచేత యిప్పుడు చాలమంది వీళ్ళచేతనే అచ్చుపనులు చేయించుకొంటున్నారు. ఇప్పుడు వీళ్ళకి తీరికలేకుండా పని వస్తూంది. ఇప్పుడిక వారానికి ఇరవై అయిదు, వొక్కొక్కసారి ముప్ఫయి డాలర్లదాకా సంపాయిస్తున్నారు. అందులో ఎక్కువ మొత్తం దాచిపెడుతుంటారు.

ఇలా కొన్ని రోజులు గడిచింది. మెల్ల మెల్లగా వాళ్ళకి యీ పత్రికమీద శ్రద్ధ తగ్గిపోవటం మొదలుపెట్టింది. ఎందుకనుకుంటున్నారు? కథలు తెసుకువచ్చి అచ్చువేయటం వాళ్లకి చాలా తేలికయిపోయింది. మొదట రోజుల్లో అయితే మాటిమాటికి అచ్చుయంత్రం చెడిపోతూవుంటే దాన్ని బాగుచేయటం-అదంతా సరదాగా ఉండేది. ఇప్పుడు అలా చెడిపోవటంలేదు. అంచేత యీ పని చాలా తేలికగా [illegible]ది. కష్టం లేనిపనులు చేయటం వాళ్ళకి అంత యిష్టంగా [illegible]దు. పాతవి బిగించడం కొత్తవి చేయడం ఇట్లా కష్టపడి పని చేయటమే వాళ్లకి సరదా.

ఎవ్వర్ను సైకిల్ పాడుచేసుకొని వస్తే దాన్ని బాగుచేసి పెట్టటం అంటే వీళ్లకి భలే హుషారుగా వుండేది. అలాంటి పనులంటే వాళ్ళకి చాలా ఇష్టం. వాళ్ల నిలవజేసిన డబ్బులన్నీ పెట్టి సైకిళ్ళు బాగుచేసే షాపు (దుకాణం) పెడదామని ఆర్వికి ఆలోచన వచ్చింది.

'ఈ రోజుల్లో సైకిళ్లు చాలా వచ్చాయి. మన రోడ్లుఏమీ బాగాలేవు. వెళ్ళేవారు ఎప్పుడూ పడుతుంటారు. ఆకులు-చక్రాలు కూడా విరిగిపోతూఉంటాయి. అంచేత మనం గనక సైకిళ్లు బాగుచేసే షాప్ పెడితే బాగా పని వస్తుంది' అని ఆర్వీ విల్బర్‌తో అన్నాడు.

'నీ ఆలోచన బాగానే వుంది ఆర్వీ. మన పత్రిక ఎవ్వర్నికి అమ్మివేసి పెద్ద బిజార్లో వాక కొట్టు అద్దెకి తీసుకుందాం' అని విల్బర్ ఉపాయం చెప్పాడు.

'తీసుకొన్నాను కూడా. నీవుకూడా 'కాదనవు' అనుకొని వాక కొట్టు మాట్లాడే వచ్చా' నన్నాడు ఆర్వీ. విల్బర్ నవ్వాడు. ఆర్వీ ఎప్పుడూ మంచి ఆలోచనలు చేస్తూంటాడు.

'మనకు కావలసిన పనిముట్లు అన్నీ ఉన్నాయిగా. అవన్నీ అక్కడికి తీసుకుపోదామా? విడిభాగాలు కూడా చాల వున్నాయి' అని ఆర్వీ మళ్ళీ చెప్పాడు.

'జాబితాలు, లెఖ్ఖలు అంతా తయారుజేశావన్నమాట' విల్బర్ తృప్తిగా అన్నాడు.

'ఓ అన్నీ తయారుగానే వున్నాయి. నాలుగు రోజులుంటే కొత్త సైకెళ్ళుకూడా తయారు చేయొచ్చు' అని హుషార్‌గా చెప్పాడు ఆర్వీ.

ఆర్వీ వాళ్ల షాప్‌కి పేరుగూడా ముందే పెట్టేసి వుంటాడు. అందుకని విల్బర్ అతన్నే అడిగాడు,

'ఆర్వీ ! మన షాప్‌కి ఏంపేరు పెట్టుకుందాం ?' అని.

'రైట్ సైకిల్ కంపెనీ' అని ఆర్వీ చెప్పేశాడు.

[ 'రైట్' అంటే వాళ్ల యింటిపేరు. సరియైనది అను ధ్వని కూడా ]

## 'రైట్ సైకిల్ కంపెనీ'

వాళ్ల సైకిల్ కంపెనీకి కావలసిన రసీదులు, జమా ఖర్చులు వ్రాసుకునే పుస్తకాలు, లెటర్‌పాడ్లు (ఉత్తరాలువ్రాసుకునే కాగితాలు) లాంటివి అన్నీ అచ్చువేసుకున్నారు. విల్బర్ ఆ కంపెనీకి అధ్యక్షుడుగానూ, ఆర్విల్ ఉపాధ్యక్షుడుగాను అనుకున్నారు.

ఆరోజుల్లో ఆ వూళ్లోవాళ్లకు ఎక్కువమందికి పాతరకపు సైకిళ్లే ఉండేవి. వీటికి వెనకచక్రం చిన్నది - ముందు చక్రం పెద్దది వుండేది. ఆ సైకిళ్లకు బ్రేకులు (తొక్కకుండాదిగే సాధనములు) ఉండేవికావు. మడ్గార్డులు లేవు. ఆతరువాత ఆ ఊళ్ళో ఒకరు కొత్తరకం సైకిలు ఒకటి కొనుక్కొచ్చారు. దాని చక్రాలు రెండూ సమానంగా వున్నాయి. పాతరకపు సైకిళ్ళకి మొద్దుటైర్లు వుండేవి. మొద్దుటైర్లు అంటే ఒకే రబ్బరుముద్ద టైరులాగా వేసేవాళ్ళు. ఈ కొత్తరకంసైకిలు అలా కాదు. ఇప్పటి సైకిళ్ళకు వున్నట్టే టైరు, దానిలో గాలికొట్టే ట్యూబూ ఉంది.

ఇలాంటి కొత్తసైకిళ్ళు తయారుచేసే కంపెనీ స్ప్రింగు ఫీల్డులోవుంది. ఆ రెండు కంపెనీల సైకిళ్ళు డేటనల్ కమిషన్ పద్ధతిన అమ్మటానికి వాళ్ళ ఏజంట్లుగా వుంటామని విల్బర్

సోదరులు ఆ రెండు కంపెనీలకు వ్రాశారు. వీళ్ళ ఉత్తరం చూడగానే స్ప్రింగుఫీల్డు కంపెనీ యజమాని చాల సంతోష పడ్డాడు. వీళ్లెవరో చాల పెద్ద వ్యాపారంచేసే కంపెనీవాళ్ళు అయి వుండొచ్చునని అనుకున్నాడు. వాళ్ళు తయారుచేసే సైకిళ్ళ విడిభాగాలు అమ్మటానికి అంగీకరిస్తూ రైట్‌సైకిల్ కంపెనీకి వ్రాశారు.

ఇదే సమయంలో డేటన్ (విల్బర్ వాళ్ళ వూరు) లో సైకిల్ క్లబ్బు అని ఒకటి పెట్టారు. రోజూ కుర్రవాళ్ళంతా ఇక్కడికి వచ్చి సైకిళ్ళు తొక్కటం నేర్చుకొంటూ వుంటారు. అంచేత రోజూ ఈ క్లబ్బు సైకిళ్ళమీద ప్రతి శనివారం ఆదివారం అన్ని వయసుల కుర్రాళ్ళు కులాసాగా చాలదూరం వెళ్లేవారు. ఇంటికి తిరిగొచ్చేలోగా తరచుగా ఏదో ఒకటి చెడిపోతూ వుండేది. విల్బర్ ఆర్వీ ఇద్దరూ పనిముట్లు తీసుకొని అక్కడికే వెళ్ళి బాగుచేసిపెట్టి వస్తూవుండేవాళ్ళు. నెచ్చెలి ఎడ్వర్డు దగ్గర ఒక పాతసైకిల్ వుండే కొన్నారు. దానికి అన్నీ కొత్తసామానులు వేశారు. చక్రాలు రెండూకూడా కొత్తవి వేశారు.

ఒకనాడు ఆర్వీ వాళ్ళ సైకిల్ బాగుచేస్తూ వున్నాడు. అప్పుడు అతని కొక కొత్త ఆలోచన తట్టింది. అది వాళ్ళ అన్నాయ్‌తో చెప్పాడు.

'నీ కెప్పుడూ ఏదో ఒక కొత్త ఆలోచన తడుతూ వుంటుంది ఆర్వీ' అని విల్బర్ నవ్వుతూ అన్నాడు.


రైట్ సైకిల్ కంపెని

'ఈ సైకిల్‌కి అది చేసి చూస్తున్నాలే - ఏమిటో చెప్ప మంటావా?' ఆర్వీ అన్నాడు.

'ఏమిటది?' విల్బర్ అడిగాడు.

'మన సైకిల్ ఇప్పుడు ఈ వూళ్ళోవున్న సైకిళ్ళ అన్నిటికంటే, వేగంగా పోతుంది. ఎందుకో తెలుసా? మనం దీన్ని అన్నిభాగాలు శుభ్రంగా తుడిచి బాగా మెరుగు పెట్టాం కదూ! రాపిడిగూర్చి అమ్మ చెప్పలేదూ? అంటే బాగా శుభ్రం చేశాంగదూ! అంచేత మన సైకిల్‌కి 'రాపిడి' తగ్గిపోయిందన్న మాట. స్ట్యూవర్ట్ నాకంటే మూడేండ్లు పెద్దవాడేగా! నాతో పందెం వేయమను చూద్దాం? నాసైకిల్‌తో రాలేడు.' అని చెబు తుంటే విల్బర్‌కి కొత్తగావుంది.

'మళ్ళీ ఏదో కొత్త ఆలోచన చేస్తున్నావు కదూ?' అన్నాడు విల్బర్.

'ఒక శనివారం మధ్యాహ్నం పందెం పెడదాం. ఇప్పుడు గనుక వాళ్ళందరితో పందెంవేసి గెలిచామంటే ఇక అందరూ మన సైకిల్‌లాంటిదే కావాలని వస్తారు. అప్పుడు మనం చాల సైకిళ్ళు అమ్ముకోవచ్చు' అని ఆర్వీ ఉపాయం చెప్పాడు.

'ఎలా?' విల్బర్ అడిగాడు.

'ఎలా ఏమిటి? కొత్తసైకిలు కొనాలంటే నూరుడాలర్లు అవుతుంది. అందరూ అంత ఖరీదు పెట్టలేరుగా. అంచేత మన దగ్గరే కొంటారు. మనం పాతసైకిళ్ళు కొని వాటికి కొత్త

సామానులువేసి అమ్ముదాం. రంగు అదీవేస్తే ముప్ఫయి డాలర్ల కయినా కొంటారు.' అని వివరంగా చెప్పాడు.

'బాగానే వుంది. అయితే మరినీవు పందెంలో గెలిస్తేగా?' విల్బర్ అన్నాడు.

'నేను అలవాటు చేసుకోబోతున్నాగా. రోజూఉదయాన్నే లేచి అయిదుమైళ్ళ దూరం తొక్కివస్తూంటా. బాగా అలవాటు అయిన తరువాత పందెం ఏర్పాటుచేద్దాం. గెలిచిన వాళ్ళకు వూరి పెద్దలు బహుమానాలు ఇచ్చే ఏర్పాటు చేద్దాం. మొదటి బహుమానం వచ్చినవాడికి మనంకూడా ఒక పనిముట్ల పెట్టె బహుమానం ఇద్దాం. సైకిల్ బాగుచేసుకోటానికి కావలసిన సామానులన్నీ వుండేపెట్టె ఇద్దాం పంపుతోసహా!'

'అది పది డాలర్లు అవుతుందికదూ?' విల్బర్ అన్నాడు.

'అప్పుడే ఒకమాట మరచిపోయావ్?' ఆర్వీ అన్నాడు.

'ఏం మరచిపోయాను?' విల్బర్ ఆశ్చర్యంగాఅడిగాడు.

'నే ముందే చెప్పలేదు - మొదటి బహుమతి గెలిచేది నేనే నని?' ఆర్వీ నిదానంగా అన్నాడు.

ఆ మరునాటినుంచే ఆర్వీ సైకిలు తొక్కటం అలవాటు చేసుకోటం మొదలుపెట్టాడు. పొద్దున్నే సైకిల్ వేసుకొని చాల దూరం వెడతాడు. ఆ రోజుల్లో ఆ రోడ్లమీద అయిదుమైళ్ళు సైకిల్ త్రొక్కటం అంటే చాల కష్టమైన పని. అయినా ఆర్విల్ మానుకోలేదు. రోజూ అలానే త్రొక్కేవాడు.

అతనికాళ్ళు, పిక్కలు బాగా గట్టిపడ్డాయి. ఇప్పటిలాగా సైకిల్ హాండిల్ క్రిందికి దించటానికి, పైకి ఎత్తటానికి వీలుగా వుండేదికాదు. ఒకనాడు ఆర్వి తనసైకిల్ హాండిల్ కోసివేస్తున్నాడు.

'అదేమిటి?' అని విల్బర్ అడిగాడు.

'ఈ హాండిల్ మరీ ఎత్తుగా వుంది. మొన్న గుర్రపు పందెం బొమ్మ ఒకటి చూచాలే. దానిమీద స్వారీచేసే అతను (జాకీ) పూర్తి గుర్రం వీపుమీద పడుకున్నట్టుగా వంగాడు. ఎందుకో తెలుసా? అలా బాగా ముందుకు వంగితే ఎదురుగాలి దెబ్బ తగ్గుతుంది. మనం స్లెడ్జిచేసుకొన్నప్పుడు అమ్మ మనకు నేర్పలేదూ? సైకిల్‌కికూడా అంతే. అందుకే ఈ హాండిల్ ఎత్తు తగ్గించివేస్తున్నా. అలా అయితే బాగా ముందుకు వంగి పోవచ్చు.' ఆర్వీ చెప్పాడు.

హాండిల్‌బార్ కోయటం అయింది. హాండిల్‌కి నిలువుగా వుండే కడ్డీని కోశాడన్నమాట. ఇప్పుడు అతను సైకిలు మీద ఎక్కితే ముందుకు వాలివున్నట్టుగా వుంటాడు. ఇప్పుడు అతని సైకిలు భలేవేగంగా పోవటమేకాదు; ఇప్పుడు ఇదివరకు వచ్చినంత అలుపుకూడా రాలేదు. ఇదివరకు నిటారుగా కూర్చొని సైకిల్‌తొక్కితే వెన్ను నొప్పిపుట్టేది. కాని ఈసారి అలాలేదు.

ఆర్వీ ఎవ్వర్నుకిచెప్పి, వచ్చే శనివారం ఫేర్‌గ్రౌండ్సులో రెండు మైళ్ళదూరం సైకిల్ పందెం వుందని పత్రికలో వేయిం

చాడు. సైకిల్ వున్నవాళ్ళెవరయినా యీ పందెంలో వుండ వచ్చు. మొదటి బహుమతి వచ్చినవాళ్ళకి సైకిల్ సామానుల పెట్టె పంపుతోసహా బహుమానం ఇస్తారు. రెండో బహుమానం యివ్వటానికి మిఠాయిలు కావాలని అడిగితే మిఠాయికొట్టు అతను అవి ఊరికెనే యిస్తానన్నాడు. మూడో బహుమానం ఒకమాంసం కొట్టు అతను ఇస్తానన్నాడు.

కుర్రవాళ్ళే కాక సైకిళ్ళు వున్న పెద్దవాళ్ళు కూడా కొందరు పందెంలో చేరారు. రేపు పందెం వుండనగా ఆ రోజు రాత్రి ఆర్వీ, విల్ ఇద్దరూ కూర్చొని వాళ్ళసైకిల్ అంతా ఏ భాగానికి ఆభాగం విడదీశారు. ఇరుసుల్లోవున్న మురికిఅంతా శుభ్రంగా తుడిచారు. చక్రాల ఆకుల్నిగూడా మెరిశేట్లు చేశారు. దానికి బాగా నూనె వేశారు. మళ్ళీ అంతా బిగించివేశారు.

'టైర్లు బాగున్నాయా ఆర్వీ. ఆపని నేను చూస్తానులే. నీవు ఈవేళ బాగా నిద్రపో' విల్బర్ అన్నాడు.

'ఓ! బాగానే వున్నాయిలే. నెల అయింది అవివేసి. ఇంతవరకు ఒక్క పంచరు (హోటు) కూడా పడలేదు.

# సైకిళ్ళ పందెం

ఆ మరునాడు మధ్యాహ్నమే పందెం. ఈ పందెంలో ఇరవై సైకిళ్ళు చేరాయి. ఇందులో సగంమంది చాలపెద్దవాళ్లు. వాళ్ళను చూడగానే ఆర్వి భయపడ్డాడు. అయినా వాళ్ళకి రెండు మైళ్ళు ఒక్క బిగిన త్రొక్కటం అలవాటు లేదులే, అందువల్ల ఎక్కువ శ్రమపడతారు అనుకొన్నాడు. ఆర్విల్ కాళ్లు యిప్పుడు ఉక్కుపాదాలలాగా వున్నాయి. ఈ రెండుమైళ్లు అలుపులేకుండానే తొక్కవచ్చు ననుకున్నాడు.

వాళ్ళల్లో ఒకరిది సరికొత్త సైకిలు. దానిపేరు కొలంబియా సైకిలు. ఇది కనెక్టికట్ రాష్ట్రం (అమెరికా) లోని హార్డ్ఫర్డ్లో తయారయింది. ఆర్వీ ఇది చూచాడు. ఇది ఇటీవల కొత్తగా తయారైంది. దీని హాండిల్ క్రిందకు-పైకి ఎటు కావాలంటే అటు మార్చుకోవచ్చు. అలాంటి వీలువున్న సైకిలు చూడటం అదే మొదటిసారి.

ఈ సైకిలు జాక్ వింటర్స్ అనే అతను కొన్నాడు. అతని వయస్సు ముప్పై. అతను తన సైకిలు చూచుకొని గర్వపడుతూ ఉండేవాడు. ఇతను చాలా కష్టపడి పని చేస్తుంటాడు. ఒక మిల్లులో ఉంటాడు. లెక్కల శాఖకు పై అధికారి.

అతను ఆర్చీకి తెలుసు. రోజూ పదిగంటలసేపయినా ఆ మిల్లులో లెక్కలు వ్రాస్తూ వుండేవాడు. అతని సైకిలు అన్నిటికంటే మంచిదే. అయినా అతనికి సైకిలు తొక్కటం అంత బాగా చేతరాదు. అతనికి ఎప్పుడూ లెక్కలు వ్రాయటంతోనే సరిపోతుంది. సైకిల్ బాగా నేర్చుకునే వీలెక్కడిది?




అదీగాక జాక్ తన హాండిల్ క్రిందికి దించివేయలేదని ఆర్చీ గమనించాడు. సైకిల్‌మీద జాక్ నిటారుగా కూర్చున్నాడు. జాక్ కూడా హాండిల్ తగ్గిస్తే చాల వేగంగా పోతాడని ఆర్చీకి తెలుసు. కాని అతను ఆ సంగతి జాక్‌తో చెప్పలేదు.

విల్బర్ ఆర్వీ దగ్గరకు వెళ్ళి మెల్లగా చెవిలో ఒకమాట చెప్పాడు. 'ఎదురుగాలి జోరుగా వీస్తూవుంది ఆర్వీ, ఒక మైలు దాకా వాళ్ళని ముందుకు పోనీ. అప్పుడు ఆ ఎదురుగాలి అంతా వాళ్ళకే తగులుతుంది. నీవు వాళ్ల వెనకాలే వెళ్ళు. ఒకమైలు పోయేసరికి వాళ్ళు ఎదురుగాలికి అలిసిపోతారు. అప్పుడు నీవు రెండోమైల్లో వాళ్ళందరినీ కొట్టివేయవచ్చు' అని తమ్ముడికి ఉపాయం చెప్పాడు. ఎడ్వర్డు అందరినీ వరుసలో నిలుచోమన్నాడు. అతను పొమ్మనగానే అందరూ సాగిపోవాలి. మిగతా వాళ్ళంతా ఎవరికి వాళ్ళే ముందు వుండాలని చూస్తున్నారు. ఆర్వీ మాత్రం అందరికంటే వెనకవుండి తన సైకిల్‌మీద గుర్రం మీద స్వారీచేసే జాకీలాగా బాగా ముందుకు వాలి త్రొక్కుతున్నాడు. జాక్ చాల పెద్దవాడు. ఆర్వి తన సైకిలు అతని సైకిలువెంట పట్టించాడు. జాక్ ఎదురుగాలిని నెట్టుకుంటూ పోతూవుంటే ఆర్వి అతని చాటున తేలిగ్గా పోతున్నాడు. ఈ పందెంవేసే మైదానం అర్ధమైలు పొడుగు వుంటుంది, ఒకతూరి చుట్టిరావడానికి. ఇది వేసవికాలం జరుగు పందెంలో గుఱ్ఱాలు వెళ్ళే దారి. కాన, రెండు మైళ్ళంటె నాల్గుసార్లు చుట్టి వెళ్ళితే పందెం పూర్తి అవుతుంది. ఆర్వీ మొదటిసారి పదో వాడుగా ఉన్నాడు. రెండోసారి అయిదోవాడుగా వున్నాడు. ముందు పోయేవాళ్ళకి ఇరవై గజాల దూరంలో వెనక వుంటున్నాడు. మూడోసారి అతను నాలుగోవాడుగా వున్నాడు. విల్బర్‌వేపు

'ఏమీ ఫరవాలేదు' అన్నట్టుగా చూచాడు. విల్బర్ అతనిని 'ఇక జాగ్రత్త' అని సైగచేశాడు.

నాలుగో పరుగులో ఉన్నారిప్పుడు. ఆర్వీ పదిగజాల దూరంలో ఉన్నాడు. తన ముందువున్న ముగ్గురిలో యిద్దరిని దాటిపోయాడు. ఇక జాక్ ఒక్కడే అతనికంటె ముందు ఉన్నాడు. అతను బాగా అలసిపోయి రొప్పుతున్నాడు. కుడి సారిలో పందెపువాళ్ళు అత్యంత వేగంపెట్టే చోటు దాటారు. ఇక నూరుగజాలే వుంది. ముందు 'వెల' దగ్గరలోకి వచ్చారు. ఇప్పుడు ఇద్దరూ సమానంగా వున్నారు. ఆర్వీ మాత్రం ఏమీ అలసిపోలేదు. ఒక్క నిట్టూర్పు కూడా విడవక 'ఇప్పుడు ఒక్క వూపులో వెళ్ళిపోవాలి' అని ఆర్వీ తనలో తాను అనుకొన్నాడు. బాగా ముందుకు వాలి జోరుగా త్రొక్కటం మొదలుబెట్టాడు. 'వెల' దగ్గర జనం అరుస్తు న్నారు. క్రమంగా జాక్‌ను కూడా దాటి ముందుకు అయిదు గజాలు వెళ్ళాడు. ఇక వందగజాలు వెడితే 'వెల' చేరుకో వచ్చు. 'ఓసి యింకేముందిలే' అని ఆర్వీ తనలో అనుకొని లోపల నవ్వుకొంటున్నాడు.

ఇంతలో వున్నట్టుండి అతని ముందు చక్రం టైరు పగిలి పెద్ద మోత మోగింది. అది తొట్రుపడి గిర్రున కుడి ప్రక్కకు తిరిగిపోయింది. ఆర్వీ హేన్‌డిల్‌బారునుండి యెగసి పడ్డాడు. ఆర్వీకేమీ దెబ్బ తగల్లేదుగాని అతనికి పిడుగు పడ్డిన ట్టయింది. జాక్‌వచ్చి కలిశాడు. 'పాపం, దురదృష్టమే ఇది

ఆర్వీ' అంటూ పలకరిస్తూ దాటివెళ్ళి పందెం గెలిచాడు. ఆర్విల్ లేచి నిలిచి సైకిల్ చేత్తో పట్టుకొన్నాడు. ఇప్పుడుకూడ అతను రెండోవాడుగా రావచ్చు. అయితే అతని ముందు చక్రం రూపం మారి పనికిరాకుండా పోయింది.

'దెబ్బ ఏమన్నా తగిలిందా ?' అంటూ విల్బర్ పరుగెత్తు కుంటూ వచ్చాడు.

'ఫరవాలేదులే-ఇది చెడకుండా వుంటే తేలిగ్గా గెలిచే వాణ్ణి' అన్నాడు నిరాశగా, ఉత్సాహంచెడి వాడినముఖంతో.

'అది మన అజాగ్రత్తలే-జాక్‌ని అభినందించు' అన్నాడు.

'మన అజాగ్రత్తే' అంటే ఏమిటో మొదట ఆర్వీకి అర్థంకాలేదు. తప్పకుండా గెలవాలిసింది కొంచెంలో తప్పిపో యింది అని మాత్రమే అనుకుంటున్నాడు. ఎడ్వర్డు జాక్‌కి పంపును, క్రొత్త పనిముట్లుగల సంచియు బహుమతి యిస్తుంటే దిగాలుపడి నిలుచుని చూస్తున్నాడు. తమ కంపెనీకి పది డాలర్లు నష్టం అయిందే అని దిగులుపడుతున్నాడు.

తోటివాళ్ళంతా అతన్ని పడిపోయినదానికి ఏదో చతుర్లా డుతున్నారు. కాని అప్పుడు అతని మనస్సు ఏమీ బాగాలేదు. జాక్ పనిచేసే మిల్లు యజమాని అతను గెలిచినందుకు సంతోష పడి వచ్చే శనివారం మళ్ళీ పందెం ఉంటుందనీ ఈసారి గెలి చినవాళ్ళకి 'ఇంగర్సాల్' కంపెనీ చేతిగడియారం బహుమతి యిస్తాననీ చెప్పాడు.

'ఇది కంపెనీకి తీసుకుపోదాం పద' అన్నాడు విల్బర్.

ఇద్దరూ మనసులో బాధపడుతూ వెళ్ళిపోయారు. కంపెనీకి వెళ్ళేదాకా విల్బర్ ఏమీ మాట్లాడలేదు. సైకిల్ లోపల పెట్టారు. విల్బర్ నిశితంగా ఆర్వీవేపు చూచాడు. ఇది మన ఇద్దరి తప్పేలే. నెలనుంచి ఉపయోగించిన టైర్లు అని చెప్పినప్పుడు మార్చి కొత్తవి వేయాలనకపోవటం నాదే తప్పు' అన్నాడు.

'చూడటానికి బాగానే వుండేవిగా!' విచారంగా అన్నాడు.

'ఇకనైనా మనం నేర్చుకోవాలి. ఆర్వీ, అసలు టైరు పనిచేసే కాలం సగటున పదిగంటలు మాత్రమే. నెలరోజులు పనిజేసిందంటే అవి బాగా అరిగిపోయి ఉంటాయనుకోకపోవటం మనదే పొరపాటు. మనం జాగ్రత్తగా చూచివుంటే అప్పుడే తెలిసేది' విల్బర్ అన్నాడు.

'కొత్తటైర్లు చాలా ఖరీదుకావూ ?' ఆర్వీ అన్నాడు.

'నిజమే. కాని కొత్తటైర్లు అయితే నీవు గెలిచేవాడివి. ఈపాటికి ఎవరయినా ఒక సైకిలు మనవద్ద కొనేవాళ్ళు'

'నేను కొంచెం ఎక్కువగా అనుకున్నానల్లే వుందికదూ ? నేను చూడకుండానే వుంటుందనుకోవటం పొరపాటే' ఆర్వీ దీనంగా అన్నాడు.

'ఇద్దరిదీ పొరపాటే. ఇంకెప్పుడూ చూడకుండా యేదీ గుడ్డిగా అనుకోకూడదు. ఒక యిదనేమిటి ? ఏదయినాసరే.

ఒకటికి రెండుసార్లు చూచుకొని మరీ చేయటం మంచిది' అన్నాడు విల్బర్.

'సరేకాని-ఇక పని చూసుకుందాం పద. రెండు కొత్త టైర్లు ఉన్నాయి నయమేలే' కాసేపట్లో పాడైపోయిన సైకిల్ బాగుచేసుకున్నారు. రెండు చక్రాలకీ సరికొత్త టైర్లు కూడా వేసేశారు.

ఆ వారంలో వ్యాపారం ఏమంత బాగాలేదని విల్బర్ గమనించాడు. ఇప్పుడు సైకిళ్ళు బాగుచేయించుకొనేవాళ్ళు వీళ్ళ షాపుకి రాకుండా వేరే చోటుకి పోతున్నారు.

'వాళ్ళ సైకిలే బాగుచేసుకోలేనివాళ్ళు యింక మనవి ఏం బాగుచేసిపెడతారు ?' అని అందరూ అనుకొంటున్నారని ఎడ్వర్డు చెప్పాడు కూడా.

'ఆగండి. వచ్చే శనివారందాకా ఆగండి చెబుతా' అన్నాడు ఆర్వీ పట్టుదలగా. ఇప్పుడు అతను ఇదివరకులాగా నిర్లక్ష్యంగా లేడు. పట్టుదల ఎక్కువయింది.

రెండోసారి పందెమప్పుడు ఆర్వి 'బరి'లోకి వెళ్ళగానే అతన్ని జూచి అందరూ పెద్దగా నవ్వారు. జాక్ కూడా మళ్ళీ ఈ పందెంలోకి తన కొత్తసైకిలు వేసుకు వచ్చాడు. ఈసారి జానిమరో అనే మరొక అతనుకూడా కొత్త కొలంబియా సైకిలు కొనుక్కొన్నాడు. అతనుకూడా పందెంలోకి వచ్చాడు.

'క్రిందటిసారి మనం గెల్చివుండే యీ వారంలో మన సైకీలు ఒకటయినా అమ్ముడుబోయి వుండేదే' ఆర్విల్ అన్నాడు విల్బర్‌తో.

'సరేలే ఊరుకో-ఒక్క నీదే కాదులే నాదీ తప్పే. ఆరోజు సంగతి యింక మరిచిపో. ఈరోజు మన సైకిల్ బాగావుంది. గెలుపు నీదేలే పద' అని విల్బర్ ధైర్యం చెప్పాడు.

ఈవేళ పందెం నడిపేది హెన్రీ. అందరినీ పిలిచి సిద్ధంగా వుండమన్నాడు. ఈల వేశాడు. అన్ని సైకిళ్లు ఒక్కసారి కదిలాయి. ఈసారి పందెం చూడటానికి చాలామంది జనంకూడా వచ్చారు. ఈసారి కూడా గెలుపు జాక్‌దేననీ అతను తేలికగా గెలుస్తాడనీ అందరూ అనుకొంటున్నారు. ఈ రోజు అసలు గాలి లేదు. అందుచేత యీసారి మొదటినుంచీ ముందు వెళ్ళిపోవాలనుకున్నాడు. మొదటిసారి జాక్ పదిగజాలు ముందు ఉన్నాడు. రెండవసారి ఇరవై గజాలు ముందుగా వున్నాడు. అప్పుడిక ఆర్వి త్రొక్కటం మొదలుబెట్టాడు. జనం అంతా నిశ్శబ్దంతో ఆశ్చర్యంగా చూస్తున్నారు. ఆర్వీ హాండిల్‌దాకా బాగా ముందుకువాలి అతివేగంగా త్రొక్కేస్తున్నాడు. మూడో సారి జాక్ కంటే నూరు గజాలు ముందుకు వెళ్ళాడు. ఆర్వి, జాక్ యిద్దరూ తప్ప పందెంలోవున్న మిగతావాళ్ళంతా ఎక్కడో వెనకనే పోయారు. ఆర్వి త్రొక్కుతునే ఉన్నాడు. వచ్చినకొద్దీ జాక్ వెనకబడిపోతున్నాడు. రెండు ఫర్లాంగులు ముందుగా వెళ్ళి ఆర్వి పందెం గెలిచాడు. 'సెభాష్, భలే తొక్కావులే'

అంటూ విల్బర్ ఆర్వి భుజం చరిచి మెచ్చుకొన్నాడు. అప్పుడు విల్బర్ ముఖంలో సంతోషం, గర్వం పొంగిపోయాయి. ఆ తరువాత హెన్రీ చిన్న ఉపన్యాసం చేసి ఆర్వికి గడియారం బహుమతిగా ఇచ్చాడు. ఆర్వికి గడియారం వుండటం యిదే మొదటిసారి.

'ఆఁ సరేగాని ఆర్వీ, నీ సైకిల్ చాల బాగా పోతుందే! మా అబ్బాయికి కూడా అలాంటిది కొనాలనుకుంటున్నాను. అది ఎక్కడ తయారయిందమ్మా ?' అని అడిగాడు.

ఏం చెప్పాలో లేక విల్బర్ తికమక పడుతున్నాడు.

ఆర్విల్‌కి మాత్రం అలాంటి జంకుగొంకు యెప్పుడూ లేదు.

'అది మేమే తయారుచేశామండి. దాన్ని మేం....ఆఁ.... ఆఁ....'రైట్ సైకిల్' అంటాం అండి' అని చెప్పివేశాడు తమ ప్రతిభ స్ఫురించునట్లుగా.

## సైకిళ్ళ వ్యాపారంలో

ఆ వారంలో వీళ్ళ షాపుకు సైకిళ్ల కొనేవారి నుండి మూడు ఉత్తరాలు వచ్చాయి. తయారుచేయడానికి డబ్బు కావాలి. ప్రస్తుతం వాళ్ళవద్ద ఎనభయి డాలర్లు మాత్రం మిగిలివుంది. మిగతాదంతా కంపెనీ క్రింద పెట్టుబడి పెట్టివేశారు. సైకిలు తయారుచేయాలంటే పాత సైకిళ్ళు కొనాలి. కొత్త సామానులు చక్రాలు, టైర్లు, సీట్లు, హేండిల్‌బార్లు అన్నికూడా కొనాలి. వీటి అన్నిటికీ అది చాలదు. చాలా డబ్బు కావాల్సి వుంది. డబ్బు ఎలా వస్తుందా అనే ఆలోచనలో పడిపోయారు. వాళ్ళ చెల్లాయి కాథరిన్ వాళ్ళు యీ కంపెనీని గురించి మాట్లాడుకునే మాట లన్నీ వింటూనే ఉంటుంది. కాని ఆ అమ్మాయి మాత్రం ఏమీ చెప్పక వూరికనే వచ్చి వెడుతూ ఉండేది.

ఆరోజు రాత్రి భోజనాలయిన తరువాత అన్నా తమ్ము ళ్ళిద్దరూ ఏమీ మాట్లాడకుండా యింటివద్ద కూర్చొని ఉన్నారు. వాళ్ళ అమ్మ ఏవో బట్టలు కుంటూ వుంది. వాళ్ళ అందరికీ కావాలిసిన బట్టలన్నీ ఆవిడే కుడుతూ ఉంటుంది.

'బాబూ ! హెన్రీగారి అబ్బాయికి సైకిలు తయారుచేస్తు న్నారటగదూ—ఆమె మిమ్మల్ని భలే మెచ్చుకుంది నాయనా' అన్నది.

'అవునమ్మా. హెన్రీగారు వాళ్ళబ్బాయికి ఒక సైకిల్ తయారు చేసి పెట్టమన్నారు' విల్బర్ అన్నాడు.

'బాబూ మీ కంపెనీలో నాకూ భాగం యిస్తారూ? నేను కూడా అందులో వాటాదారుగా చేరాలని వుంది. నావద్ద మూడు వందల డాలర్లు ఉన్నాయి. అవి వూరికే బ్యాంకులో ఉంటే యేమొస్తుంది? మీ కంపెనీలో పెట్టుబడి పెడితే బావుండును' ఆవిడ బట్టలు కుట్టుకుంటూనే ఆమాట అన్నది.

'నిజంగానే కలుస్తావా అమ్మా?' ఆర్వి ఉత్సాహంతో అడిగాడు.

'అవును నాయనా—తన ఇద్దరు కొడుకులతో వ్యాపార భాగస్థురాలు అగుటకు యే తల్లి సంతోషపడదు? అయినా యిప్పుడు మీకు డబ్బు అక్కర్లేదేమో!' ఆవిడ అన్నది.

'అట్టే ఎక్కువగా అవసరం లేదుగాని ఆ మూడు వందలూ ఉంటే ఒక డజను సైకిళ్ళకు సరిపోయే సామాన్లు ఒకేసారి కొని పెట్టుకోవచ్చు అమ్మా' ఆర్వి చెప్పాడు.

'బ్యాంకువాళ్ళతో యివాళే చెప్పాను. మీకు కావలసినప్పుడు తెచ్చుకోండి బాబూ' అన్నది ఆవిడ.

'మాకు డబ్బు అవసరం వుందని నీకెలా తెలుసమ్మా?' విల్బర్ అనుమానంగా అడిగాడు.

'అదే....అదేముంది? నేను మీలో భాగం కలవాలనుకున్నాను' ఆవిడ అన్నది.

కేట్ యీ మాటలన్నీ వింటూ ఒక మూలను కూర్చు న్నది. విల్బర్ చెల్లాయివేపు నీవే చెప్పినట్లుంచే అన్నట్టు చూచాడు. ఆ అమ్మాయే చెప్పివుంటుందని విల్బర్ అనుకొన్నాడు. ఈ సంగతి రహస్యంగా ఉంచాలని వాళ్ళ అమ్మ, చెల్లాయి చూస్తున్నారని కూడా అతనికి తెలుసు. తమ్ముడితో అన్నాడు.



'ఆర్వీ! నీవు రేపు సిన్‌సిన్‌నేట్ వెళ్ళి వస్తావుగదూ? పోదాంపద. ఏమేం సామాన్లు కావాలో జాబితా వ్రాసుకుందాం. మొత్తంగా కొంటే వెలకూడా తగ్గుతుంది.'

'ఇక్కడ కూర్చొని వ్రాసుకుందాంలే' ఆర్వి అన్నాడు.

ఇద్దరూ కాగితం, కలం పుచ్చుకుని వంటింట్లో టేబిల్

దగ్గరకు వెళ్ళి కూర్చున్నారు. వాళ్ళు కొనాలిసిన సామానులన్నీ జాబితా వ్రాసేసరికి అర్థరాత్రి దాటిపోయింది.

ఆ మరునాడు ఆర్వీ వెళ్ళి సైకిళ్ళ ఫ్యాక్టరీలన్నీ మంచి సామానుల కోసం వెతుకుతున్నాడు. అక్కడ పెడళ్ళు ఇక్కడ టైర్లు మరొకచోట చక్రాలు యిట్లా సామానులన్నీ కొన్నాడు. సామానంతా వచ్చేసింది. ఈసారి యిదివరకెప్పుడూ చేయనంత ఎక్కువగా పని చేస్తున్నారు. రోజు విడిచి రోజు అర్థరాత్రిదాకా పని చేస్తూనే ఉన్నారు. సైకిళ్ళ పాతవి విప్పేసి కొత్తసామాన్లువేసి బిగిస్తూండేవారు.

ఆ రోజుల్లో పెద్ద పెద్ద కంపెనీవాళ్ళు తయారుచేసే సైకిళ్ళు నూరు డాలర్లదాకా ఖరీదు వుండేవి. ఆ రోజుల్లో పెద్ద ఎత్తున సైకిళ్ళు చేయటం మొదలుబెట్టలేదు. కావలసిన ప్రతి సామాను చేత్తో చేయాలి. అంచేత ఖరీదు ఎక్కువగా వుండేది. చేయటానికి టైము కూడా ఎక్కువ పట్టేది. సైకిళ్ళ అమ్మ టంలో పెద్ద కంపెనీలు రైట్ కంపెనీతో పోటీ చేయలేకపో తున్నాయి. వాళ్ళకేమో పనివాళ్ళ జీతాలు-అవన్నీ వుండటంచేత ఖర్చులెక్కువ. వీళ్ళకు అవన్నీ అవసరంలేదు. అంచేత వాళ్ళ కంటే వీళ్ళు తక్కువ ఖరీదుకే అమ్మగలుగుతున్నారు. వేతనం కూడా తీసుకోరు. వచ్చే లాభాలు మూడు భాగాలుజేసి తమ భాగం మళ్ళీ సామానులు కొనటానికే పెట్టుబడి పెట్టేవాళ్ళు.

వీళ్ళవద్ద సైకిలు కొన్నవాళ్ళకి ఒక సంవత్సరందాకా మరమ్మత్తుల ఖర్చు వుండదు. ఎందుకంటే వీళ్ళే డబ్బులు తీసు

కోకుండా వూరికేనే మరమ్మతులు చేసిపెడతామని మాట ఇచ్చే వారు. అనగా, ఏడాదిలోగా వారివద్ద కొన్నవారు ఆ సైకిల్లో ఏదైనా చెడితే మూడవవీధి మలుపుప్రక్కనున్న షాపుకు దాన్ని తీసుకొనిరావాలి. వెంటనే పీటలో, అర్థ్వయో లతనికి ఏ ఖర్చు లేకుండా బిగించేవారు. కొలంబియా కంపెనీలో సైకిల్స్‌కొన్న వారికి యిటువంటి సౌకర్యాలు లేవు. అసలు సైకిళ్ళ కంపెనీలు ఎక్కడో మూడు నాలుగు వందలమైళ్ళ దూరాన ఉండేవి. అంచేత మొదట్లో వారు బిగించినప్పుడు కొన్నాళ్ళదాకా అవి సరిగా లేకపోవచ్చు. కాబట్టి రైట్ సోదరులో వేరెవ్వరో మర మ్మత్తు చేయాలి. అందుకు పైకం యివ్వాలిగదూ? అంచేత వూరికేనే బాగుచేసిపెడతామని పెట్టే షరతువల్ల చాలామంది వీళ్ళ దగ్గరే కొనటానికి వచ్చేవారు. అందువల్ల వీళ్ళకు పని ఎక్కువై యింకా యిద్దరు పిల్లల్ని పనిచేయటానికి పెట్టుకో వలసి వచ్చింది. ఇప్పుడు వాళ్ళకి బాగా డబ్బు వస్తోంది. అయినా వాళ్ళకి తృప్తిగా లేదు.

దీనికి ఒక ముఖ్యమైన కారణం ఏమిటంటే యింకా మంచివి తయారుచేయాలనే వాళ్ల కోరికే. ఎప్పటి కప్పుడు కొత్తరకం వస్తువులు తయారుచేయాలనే వాళ్ళ కోరిక. అంచేత ఒకసారి ఒకపని చేయటం చేతనయితే యిక దానిమీద వాళ్ళకి శ్రద్ధ తగ్గుతుంది. అంతకంటే ఏదైనా కొత్తరకం తయారుచేయాలని వాళ్ళ ఆలోచన. అందువల్ల యిప్పుడు యేదైనా మార్పు తీసుకురావాలని చూస్తున్నారు.

రైట్ సైకెళ్ళ కంపెనీకి ఎవరయినా వచ్చి కొంచెంసేపు కూర్చుంటే చాలు. వెనుక వేపునుంచి ఏదో ఒక శబ్దం విన పడేది. అదేమిటంటే వీళ్ళ అన్నాతమ్ముళ్ళు అక్కడ ఒకకొత్త పాక వేస్తున్నారు. 'అదేం చేయటానికి?' అని ఎవరయినా అడిగితే ఆర్వి 'ఆఁ వూరికేనే పనిలేక అలా చేస్తున్నాంలే' అని చెబుతుండేవాడు.

ఆ వెనుక వాళ్ళొక పాకవేశారు. అది బయటినుంచి వచ్చేవాళ్ళెవరికీ కనపడదు. అందులో వీళ్ళు క్రొత్త కొత్త వస్తువులు తయారుచేస్తుంటారు. అంటే యిది వాళ్ళు రహస్యంగా పరిశోధనలు చేసుకొనే చోటు అన్నమాట.

ఒకనాడు వీరు అక్కడ పనిచేసుకుంటుంటే వాళ్ళ చెల్లాయి అక్కడికి యేడ్చుకుంటూ పరుగెత్తుకువచ్చి 'ఇంటికి రండి అన్నాయ్—అమ్మ—' అంటూ హడావిడిగా పిలిచింది.

అంతే—ఆ మాట వినగానే వాళ్ళిద్దరూ సామానులు అక్కడే పారవేసి యింటికి పరుగెత్తారు. కొన్నాళ్ళనుంచి ఆవిడ జబ్బుతోవుంది. జీర్ణశక్తి తగ్గిపోయింది. బాగా చిక్కిపోయింది. ఆవిడకు, కూతురుకు మాత్రం తెలుసు. కాని కొడుకులతో ఈ సంగతి చెప్పవద్దని డాక్టరుతో చెప్పింది. వీళ్ళు యింటికి వచ్చే సరికి వాళ్లనాన్న ఆవిడ గదిలోనుంచి వస్తూ ఒక నిట్టూర్పు విడిచాడు. వాళ్ల అమ్మ యిక వాళ్లకు లేదు. ఇట్టి తల్లిని తిరిగి యికనెప్పుడూ పొందలేమని వాళ్ళు తెలిసికొన్నారు.

# సన్నిపాత జ్వరం

ఆ తరువాత కొన్ని సంవత్సరాల వరకు వాళ్ళ కంపెనీ పని దప్ప ఇంకేమీ చేసేవాళ్ళుకాదు. వాళ్ళ అమ్మ అంటే వాళ్ళు ఎంతో యిదిగా వుండేవాళ్ళు. అందుకే వీళ్ళంటే అందరూ జాలిపడుతుంటారు. అన్నా తమ్ముళ్ళిద్దరూ ఇంకెవరూ లేకుండా ఒంటరిగా వుండాలని చూస్తుంటారు. వాళ్ళెప్పుడూ అమ్మసంగతి మాత్రం ఎవరివగ్గరా ఎత్తేవాళ్ళు కాదు. పని... పని....ఒకటే పని చేయటం. అంతే. మరొక సంగతే వాళ్ళకి పట్టేదికాదు. రహస్యపు కలలు ఏవైనా గాంచితే తమలోనే పెట్టుకొంటారు.

ఆదివారంనాడు మాత్రం వూరు వెలుపల కొంత దూరం దాకా నడిచివెళ్ళి వచ్చేవాళ్ళు. అప్పుడు వాళ్ళిద్దరూ యేమి మాట్లాడుకుంటారో యింకెవరికీ తెలియదు. అప్పుడప్పుడూ బిగ్‌హిల్ కొండగట్టుకు వెళ్ళి పిల్లలు ఆడుకుంటుంటే చూస్తూ వుండేవాళ్ళు.

ఒక ఆదివారంనాడు ఆ కొండదగ్గర వాల్టర్ బ్రూకిన్స్ అనే పదకొండేళ్ల కుర్రాడొకడున్నాడు. వాళ్ళ యిల్లు విల్బర్ యింటి ప్రక్కనే. వీళ్ళవద్ద ఆ కుర్రాడికి ఒక సైకిల్ కొన్నారు కూడా. ఆ కుర్రాడు గాలిపటం ఎగురవేస్తుంటే అది జోయి

ఒక చెట్టుకొమ్మల్లో పట్టుకుని పాడైపోయింది. వాడు బిక్క-మొగం పెట్టాడు.

'ఏం అబ్బాయ్. రేపు మా కంపెనీ దగ్గరికిరా - కొత్తది చేసిపెడతాం!' ఆర్వి ఆ కుర్రాణ్ణిచూసి అన్నాడు ఆ మర్నాడు ఒక గాలిబుట్ట తయాచేశారు. దాన్ని వాళ్ళే ఎగరవేసి చూచారు. మళ్ళీ అప్పటినుంచి గాలిపటాలు చేయటం, కొండగట్టుకి వెళ్ళి ఎగరవేయటం మొదలుబెట్టారు. ఇదిజూచి కొందరు నవ్వుకొనేవాళ్ళు. 'ఇదేమిటి ఇంత పెద్దవాళ్ళయ్యారు, ఇంకా సిగ్గయినా లేకుండా గాలిపటాలతో ఆడుకుంటున్నారే' అనుకొనేవాళ్ళు. కాని వారు యేదో గొప్పదాన్ని కనిపెట్టటానికే యిలా చేస్తున్నారని వాళ్ళకేం తెలుసు? ఆ గాలిపటాలు ఎగరవేసి అవి గాలి ఎక్కువయినప్పుడు ఎలా ఎగురుతాయి, తక్కువగా వున్నప్పుడు ఎలా యెగురుతాయి అని యెప్పుడూ పరీక్షతో చూచేవాళ్ళు. ఒకసారి ఒక గాలిబుట్ట చేశారు. అది ఆకాశంలోకి అరమైలు ఎత్తుకు పోయింది. ఇంతలో వున్నట్టుండి పెద్దగాలి, వాన వచ్చింది. అయినా వాళ్ల గాలిబుట్ట అలానే ఎగురుతూ వుండటం వాళ్ళు గమనించారు. 'భలే తమాషాగా వుందే! ఇక్కడ మన దగ్గరేమో ఇంత పెద్దగాలి వేస్తుంటే అక్కడ గాలిపటం ఉన్నచోట అసలు గాలే లేదు' విల్బర్ అన్నాడు.

'గాలిని గురించియు, గాలిలోనుండు ప్రవాహాలను గురించియు మనం ఇంకా బాగా తెలుసుకోవాలికదూ? జ్ఞానోదయం

కలిగింది. ఇక పోదాం పద అన్నాయ్. నా కెందుకో యేమీ బాగా లేదు' ఆర్వీఅన్నాడు. ఎప్పుడూ తాను అలసినట్టుఒప్పుకోనివాడు.

విల్బర్, ఆర్వీవైపు జాగ్రత్తగా చూచాడు. ఆర్వీ ముఖ మంతా యేదో ఉబ్బినట్టుగా కనపడింది. చేతిలోవున్న గాలిబుట్ట అందుకొమ్మని బ్రూకిన్స్‌కి ఇచ్చివేసి ఇంటికి వెళ్ళిపోయారు. డాక్టరువచ్చి ఆర్వీని చూస్తున్నాడు.

'బాగా జలుబుచేసినట్టుంది డాక్టరుగారూ' ఆర్వీ చెప్పాడు.



'అవును, అలానేవుంది. కొన్నాళ్ళు కదలకుండా పడు కోవాలి. నిన్ను చూస్తూ వుండటానికి ఒక నర్సుని పంపుతాలే' అన్నాడు డాక్టరు.

'నర్సు యెందుకు-చిన్నన్నాయ్‌ని నేను చూస్తుంటాలెండి' కాథరిన్ అన్నది.

'పగలు చూస్తావనుకో. రాత్రిపూట కయినా ఒక నర్సు కావాలిగదమ్మా ?'

'ఈ కొంచెం జలుబుకేనాండీ ?' మగతగా వుండే ఆర్వి అన్నాడు.

'ఇది మామూలు జలుబు కాదు. సన్నిపాత జ్వరం' (Typhoid) అని డాక్టరు మెల్లగా చెప్పాడు.

'సన్నిపాత జ్వరమా—డాక్టరుగారూ ?' విల్బర్ తెల్ల బోయి చూచాడు. కాథరిన్ కూడా తెల్లబోయింది. అయినా ధైర్యంగా 'ఫరవాలేదులెండి, మేం జాగ్రత్తగా చూస్తాంగదూ!' అన్నది.

'ఎంచేత వచ్చిం దంటారు డాక్టరుగారూ ?' విల్బర్ అడిగాడు.

'అది ఎలా వస్తుందో ఎవరికీ తెలియదు. అసలు డాక్టర్లకు కూడా దాన్ని గురించి అంత బాగా తెలీదు. (ఆ రోజుల్లో మాట) చాలా ప్రమాదమయింది. జ్వరం చాలా తీవ్రంగావుంది. ముందు అది తగ్గించే మార్గం చూడాలి. ఒక మందు వ్రాసి యిస్తాను. త్వరగా బజారుకువెళ్ళి అది పట్టుకురా విల్బర్. కేట్, నీవు పోయి ఒక పెద్ద కుండ పట్టుకొచ్చి అందులో మంచుగడ్డ వేసి ఆర్వి నుదుటిమీద పెట్టు. ఎలాగయినా ఈ జ్వరం తగ్గించాలి' డాక్టరు కూడా అధైర్యంగానే చెప్పాడు.

ఆ రోజుల్లో సన్నిపాత జ్వరంవస్తే నయమవడం కష్టం. దానికి అప్పుడు వైద్యమేలేదు. వచ్చిందంటే చచ్చిపో వలసిందే. అలా వుండేది. డాక్టర్లకు కూడా యీ యింజక్షన్లు అవీ తెలీవు. ఈ రోజుల్లో అలాకాదు. స్కూలుకు వెళ్ళి ప్రతి పిల్లవాడికి స్ఫోటకం రాకుండా టీకాలు వేస్తారు. అలానే సన్ని పాతం కూడా రాకుండా టీకాలు వేయిస్తూ వుండేవాళ్ళు. పోయిన ప్రపంచ యుద్ధ సమయంలో ప్రతి సైనికుడికి జబ్బు చేయ కుండా, టీకాలు ఇంజక్షన్లు వేసేవాళ్ళు. అంచేత సాధారణంగా జబ్బులు వచ్చేవి కాదు. ఆ రోజుల్లో అలాకాదు. ఆర్వీకి జబ్బు చేసిన నాటికి (1896వ సంవత్సరంలో) ఇంకా యీ టీకాలు, ఇంజక్షనులు లేవు.

ఆ తరువాత రెండు వారాలదాకా ఆర్వీకి స్పృహలేదు. డాక్టరు ఒక నర్సును కూడా పెట్టాడు. అయినా విల్బర్, కాథ రిన్ యిద్దరూ రాత్రింబగళ్ళు ఆర్వీని కనిపెట్టి వుండేవాళ్ళు. ఇద్దరూ ఒకరిని మార్చి ఒకరు ఆర్వీ ముఖాన చన్నీటితో కాపు వేస్తూ వున్నారు. అయినా జ్వరం పెరుగుతూనే వుంది, కాని తగ్గటంలేదు. 105 డిగ్రీలదాకా వచ్చింది.

ఆర్వీకి యిప్పుడు కలవరింతలు, పలవరింతలు వస్తు న్నాయి. ఏవో పిచ్చి పిచ్చి మాటలు మాట్లాడుతున్నాడు. కాథ రిన్‌కి ఇవన్నీ ఆశ్చర్యంగా వున్నాయి. విల్బర్‌కి మాత్రం ఇవి కొత్తమాటలు కాదు. 'ఎగిరిపోరాం' 'ఎగిరిపోతాం' అంటు

న్నాడు. ఆర్విల్ ఆ సమయంలో వెనుక, వారు కొండ గట్టుమీద మొదటిసారి గాలిపటం ఎగరవేసిననాటి సంగతులు తలుచు కుంటూ వుంటాడని అనుకొన్నాడు.

'గాలిపీడనం, 'ఎదురుగాలి', 'పైకిపోరు గాలి వెల్లువలు' ఇలాంటి మాటలన్నీ అంటున్నాడు ఆర్వీ. కాథరిన్‌కి ఇవన్నీ కొత్త కొత్త మాటల్లాగా వున్నాయి. విల్‌కి మాత్రం యివన్నీ తెలుసు. మనుషుల్ని కూడా పైకి యెత్తుకుపోయే గాలిపటాలు తయారుచేయాలని ఆర్వీ పలవరింతల్లో అనుకొంటూ వుంటాడని కూడా విల్‌కి తెలుసు. ఆదివారం రోజున అన్నాదమ్ముళ్ళిద్దరూ షికారు వెళ్ళినప్పుడల్లా వీటిని గురించే మాట్లాడుకుంటూ వుండే వారు. అయితే అవి తయారుచేసేది ఎలానో వాళ్ళకు తెలియ లేదు.

మూడు వారాలు చాలా కష్టంగా గడిచింది. నిద్రలేక కాథరిన్‌కి కళ్ళు బాగా వాచిపోయాయి. ఆ అమ్మాయి పూర్తిగా చిక్కిపోయింది. డాక్టరు రోజూ రెండుసార్లువచ్చి చూచిపోతూనే వున్నాడు. కాని ఆయన మాత్రం 'జ్వరం దానంతట అదే తగ్గాలిసిందే' అంటూవుండేవాడు. తా నింకేమీ చేయలేనని ఆయనకు తెలుసు. అంచేతనే యీ మాట చాలా విసుగ్గా అనే వాడు.

ఈ రోజుల్లో అయితే 'దీనికేమీ వైద్యంలేదు. దానంతట అది పోవాలిసిందే' అని ఏ డాక్టరూ అనడు. ఇప్పుడు వైద్యం

లేని జబ్బు లంటూ లేవు. దాదాపు అన్ని జబ్బులకీ మంచి ఔషధాలు (మందులు) వున్నాయి. ఏ యే జబ్బులు ఏ యే క్రిమి కీటకాలవల్ల వస్తాయో వాటి అన్నిటినీ నిర్మూలించే (చంపివేసే) ఔషధాలు యీనాడు వున్నాయి. యాభై సంవత్సరాల క్రిందట ఇలా వుండేదికాదు. ఆర్విల్ పూర్తిగా చిక్కిపోయాడు. అతని శరీరంలో చర్మమూ, ఎముకలు తప్ప మాంసం అనేది లేకుండా పోయింది. మండిపోయే జ్వరం అతన్ని పీల్చి పిప్పి చేసింది.

ఒకనాడు ఉదయానే లేచి ఆర్విల్ దగ్గరికి వెళ్ళి నుదుటి మీద చేయిపెట్టి చూచింది. జ్వరంలేదు. చల్లగావుంది. నూతిలో నుంచి వినపడినట్టు ఆర్విల్ గొంతులో నుంచి ఒక మాట విన పడింది.

'నాకు జ్వరంవచ్చి ఎన్నాళ్ళయింది?' అని అడిగాడు.

ఇక ఫరవాలేదని కాథరిన్‌కి తెలుసు. డాక్టరు ఈసంగతి విని గబ గబా పరుగెత్తుకుంటూ వచ్చాడు. ఆర్వీ వేడిమి ఎన్ని డిగ్రీలు ఉందో చూశాడు. అది సాధారణ పిలకపు దగ్గరగా వున్నట్టు కనపడింది.

'అమ్మయ్యా, ఇక జ్వరం పోయినట్టేలే' అన్నాడాయన.

'నాకు నయమయిందా?' ఆర్వీ లోన మెల్లగా గొణిగి నట్టుగా అన్నాడు.

'ఇక నయమవుతుందిలే. అయితే నీవు ఇంకా రెండు నెలలయినా కదలకుండా మంచంమీదే పడుకుంటేగాని బాగా తిరిగే శక్తిరాదు' అని చెప్పాడు డాక్టరు.

'రెండు నెలలా ?' ఆర్విల్ అడిగాడు.

'రెండు వారాలు అయితే అప్పుడు లేచి కూర్చోవచ్చు' అన్నాడు డాక్టరు.

'పుస్తకాలు కూడా చదువుకోకూడదా ?' ఆర్విల్ అడిగాడు.

'ఏమీ వల్లగాదు' డాక్టరు గట్టిగా చెప్పాడు.

నేను చదివి వినిపిస్తాలేరా ఆర్వీ. అందుకే కొత్త పుస్తకాలు కూడా తెచ్చాను. అందులో ఒకటి భలే బాగా వుందిలే! దానిపేరు 'ఎగసే శోధనానుభవాలు' వ్రాసినవారు ఆటో లిలిన్‌టాల్' విల్బర్ అన్నాడు.

'బావుందా ? అయితే చదువు' అన్నాడు ఆర్వీ.

'ఇప్పటికి నిద్రపో - రేపటినుంచి వినవచ్చునులే' అని చెప్పాడు డాక్టరు.

ఆర్విల్ కళ్ళు మూసుకున్నాడు. వెంటనే మంచి నిద్ర పట్టింది.

విల్బర్ డాక్టర్‌వెంట బయటదాకా సాగనంపటానికి వెళ్ళాడు. డాక్టర్ బండి ఎక్కిపోతూ ఇకముందే ఆర్విల్‌ని జాగ్రత్తగా చూడాలని చెప్పాడు. కదలకుండా మంచంమీదనే

పడుకొని వుండాలనీ, ఆర్విల్ మనసుకు విసుగు కలగనీయ కూడదనీ చాల జాగ్రత్తగా చూస్తూ వుండాలనీ చెప్పాడు.

'మీ కెందుకు - నేను చూస్తూవుంటాగా డాక్టరు గారూ! లిలిన్‌టాల్ వ్రాసిన పుస్తకం చదివి వినిపిస్తే ఆర్విల్ ఎంతయినా సంతోషపడతాడండి. ఆ పుస్తకంలో అతను మనిషిని పైకి ఎత్తుకుపోయే గాలిపటం తయారుచేశాడని వుంది. ఆర్విల్ యిది వింటేచాలు' అన్నాడు విల్బర్.

'విల్బర్! నీకూ పిచ్చిపట్టిందా ఏమిటి?' డాక్టర్ నవ్వుతూ అన్నాడు.

విల్బర్ ఒక్క క్షణం అక్కడే నిల్చున్నాడు.

ఇంకెప్పుడూ మా ఆలోచనలు ఎవరికీ చెప్పగూడదు. చెబితే మేం పిచ్చివాళ్ళం అనుకుంటారు. అని మనసులో అనుకున్నాడు.

# పుస్తకాలలో నేర్చుకొన్నది

మూడు రోజులు తరువాత సంగతి. విల్బర్ కూర్చుని చదువుతున్నాడు.

'నా చిన్నతనంలో ఒకనాడు పిట్టలు ఎగురుతూ వుండటం చూచాను. పిట్టల్లాగానే ఎగిరే గాలిపటాలు చేయాలని చాలా ప్రయత్నం చేశాను. కాని చేతరాలేదు. పిట్టల రెక్కలు చదరంగా వుండవు. అవి లోవంపుగా ఉంటాయని తెలుసుకొన్నాను. సరిగ్గా పిట్టలరెక్క ఆకారంలో ఒక పెద్ద గాలిపటం తయారుచేశాను. ఒకకొండ మీదకు వెళ్ళి దానిని ఎగరవేశాను. కొంతసేపు ఎగిరి తరువాత క్రిందికి దిగి తేలికగా నేలపై పడిపోయింది.

చదవటం ఆపి విల్బర్ అన్నాడు.

'చూచావా, ఆర్విల్! ఆటోలిలింటాల్ ఎలా చేశాడో? మనం పొరపాటు పడ్డామే! ఎప్పుడూ లోవంపుగా చేయలేదుగా మనం?

'ఆటోలిలింటాల్ గురించి నీ కెవరు చెప్పారు?' ఆర్విల్ అడిగాడు. ఆర్విల్ మంచంమీద పడుకుని చూస్తూ అన్నాడు. చేయికూడా కదిలించలేనంత బలహీనంగా వున్నాడు. అయితే

లిలింటాల్ పుస్తకంలో సంగతులు వినగానే తనలో యేదో కొత్తగా బలం వచ్చినట్టు ఉం దతనికి. ఓపిక తెచ్చుకుని అడిగాడు.

విల్ చెప్పాడు. 'ఒక సైకిల్ కంపెనీవాళ్లు మనకొక పత్రిక పంపారు. అందులో చాలా కొత్త సంగతులు వున్నాయి. గుర్రాలు లేకుండా నడిచే బండ్లు తయారుచేయటానికి ఎవరెవరు ఎలా ప్రయత్నం చేస్తున్నారో అందులో వ్రాసివుంది. త్రొక్కకుండానడిచే సైకిళ్ళనుగురించి కూడా వుంది. అందులోనే ఒకచోట లిలింటాల్‌ని గురించికూడా వ్రాసివుంది. అతని పుస్తకం కావాలిసినవాళ్ళు వాషింగ్టన్ (అమెరికా)లోని 'స్మిత్ సోనియన్ సంస్థ' అనేవారికి వ్రాసి తెప్పించుకోవచ్చు అని కూడా వుంది'

'స్మిత్ సోనియన్ సంస్థ అంటే?' ఆర్వి అడిగాడు.

'అది ప్రభుత్వం పెట్టిన పెద్ద సంస్థ. ప్రొఫెసర్ సామ్యుల్‌లాంగ్లీ అనే ఆయన దానిమీద పెత్తనదారు. ఆయనకే వ్రాశాను. ఆయన ఒక పుస్తకం పంపుతూ ఒక ఉత్తరం కూడా వ్రాశాడు. మనకుఎగిరే వస్తువుల విషయంలో గనుక ఇష్టంవుంటే ఇంకా చాలా పుస్తకాలున్నాయి, అవికూడా పంపుతానన్నాడు. చూచావా ఆర్వి! మనకు తెలియదుగాని ఇంకా చాలామంది మన లాగానే ప్రయత్నాలు చేస్తున్నారన్నమాట. ఆ పుస్తకాలు పంపమని వ్రాశాలే' అన్నాడు విల్బర్.

'ఆ లిలింటాల్‌ని గురించి ఇంకా చెప్పు' ఆర్వి అడిగాడు.

'చూస్తే అతనూ మనలాంటివాడే లాగుంది. అతనూ మొదట గాలిపటాలు చేసి ఎగరవేసేవాడు. మనం అనుకున్నట్టే మనుషుల్ని ఎత్తుకుపోయే గాలిపటం చేయాలని అతనికీ అని పించింది. చాలా ప్రయత్నాలు చేశాడు. పది పదిహేను రకాలు చేసిన తరువాత చివరికి అతను అనుకున్నట్టే ఎగిరే గాలిపటం తయారు చేయగలిగాడు. దాన్ని అతను 'గ్లయిడర్' అన్నాడు' విల్బర్ చెబుతున్నాడు.

'గ్లయిడరా ?' ఆర్విల్ మళ్ళీ అదేమాట అన్నాడు.

'అతను అది పట్టుకొని ఒక కొండమీదికి వెళ్ళి అక్కడ నుంచి ఎగిరి క్రిందకు వచ్చేవాడట. గాలి సరిగా వున్నప్పుడు ఒక నిముషంసేపు అతనూ గాలిలో ఎగురుతూ ఉండేవాడట' విల్బర్ చెబుతున్నాడు.

'ఇంతకీ గాలినిబట్టి వుంటుంది కదూ ?' ఆర్వి అడిగాడు.

'గాలినిబట్టి అంటే ?' విల్బర్ అడిగాడు.

'అంటే ఎగిరిన తరువాత గాలినిబట్టి, పైకి పోవటంగాని క్రిందకు వాలిపోవటంగాని జరుగుతుం దనుకుంటా. గాలి ఎటు తీసుకుపోతే అటు పోవాలిసిందే. మనం అనుకొన్నట్టు ఎగర టానికి వీలుగా వుండాలిగాని, గాలి ఎటు తీసుకుపోతే అటు పోవటం అయితే వుపయోగం ఏముంది ? ఆఁ. లిలింటాల్‌గాక ఇంకా ఎవరైనా ఇలాంటివి తయారు చేస్తున్నారా ?' ఆర్వి అన్నాడు.

'ఆఁ ఇంకా చాలామంది చేయాలని చూస్తున్నారు. స్మిత్ సోనియన్ సంస్థలో ప్రొఫెసర్ లాంగ్లే అనే ఆయన, చికాగోలో ఆక్టేవ్ షాన్యూట్ అనే ఆయన, హిరామ్ మాక్సిమ్ అని మరొక ఆయన. ఇలా చాలమంది ప్రయత్నం చేస్తున్నారు. అయితే ఇప్పటిపరకు గ్లయిడర్‌ను వుపయోగించి చూచింది లిలింటాల్ ఒక్కడే' విల్బర్ చెప్పాడు.

'అతను నమూనాలు సరిగా వేసుకొని వుంటాడు. అంచే తనే అతని గ్లయిడర్ సరిగ్గా కుదిరి వుంటుంది' అంటూ ఆర్విల్ నవ్వాడు.

'అంతే. అమ్మ చెప్పలేదూ! అతను అలానే చేశాడు. సరేలే, నీవు మెదలకుండా పడుకో. నే నింకా చదువుతాను' ఆ మధ్యాహ్నం అంతా విల్బర్ లిలింతాల్‌ని గురించి చదువు తుంటే ఆర్విల్ వింటూ పడుకున్నాడు. విల్బర్ అది చదవటం కాగానే ఒక పత్రికలో ఆక్టేవ్ వ్రాసిన వ్యాసం చదివి వినిపిం చాడు. ఆ తరువాత వాళ్ళ వూళ్ళో లైబ్రరీలో పక్షులు యెగర టాన్ని గురించిన పుస్తకం ఒకటి కనపడితే అదికూడా తెచ్చి చదివి వినిపించాడు.

ఒకనాడు స్మిత్‌సోనియన్ సంస్థ నుంచి కొన్ని కరప త్రాల్లాంటి పుస్తకాలు పోస్టులో వచ్చాయి. వాటిల్లో గ్లయిడర్ల గురించి చాలా వ్యాసాలు వ్రాసివున్నాయి. ఇవన్నీ చదువు తుంటే ఆర్విల్ వింటూ 'ఏనాటికయినా దాని సంగతి తేల్చి ఈ

ప్రపంచాన్ని ఆశ్చర్యపడేలాగా చేయగలుగుతాం' అని కలలు గంటున్నాడు. ఆ రోజు డాక్టరు అన్న మాటలు ఆర్విల్‌తో చెప్పాడు విల్బర్. చదువుకొన్నవాడు, తెలివిగలవాడూ అను కొన్న డాక్టరే అలా అంటే ఇక మామూలు మనుషులు వీళ్ళ ఆలోచనలు వింటే (ఆ రోజుల్లో) ఏమనుకొనేవాళ్ళో!

'మనకే బాగా డబ్బు వుంటే గ్లయిడర్ తయారుచేసి దూరంగా వెళ్ళి దాన్ని ఎగరవేసి చూడొచ్చుగదూ? కానీలే, నాకు నయం అయిన తరువాత మళ్ళీ బాగా పనిచేసి ఈ రెండు నెలల్లో పోయిన వ్యాపారం అంతా మళ్ళీ వచ్చేట్టు చేద్దాం' ఆర్వీ అన్నాడు.

'ఏ వ్యాపారం పోయిం దంటావు? ఆ సైకిళ్ళ పందెం ప్రతివారం జరుగుతూనే వుంది. నీవు జబ్బులో వుండగా నేను మూడుసార్లు వరసగా పందెంలో గెలిచాను. అప్పటి నుంచి మనదగ్గర సైకిళ్లు కొనటం ఎక్కువయింది. ఇంకా ఎక్కువయితే మనం అందించలేమని నేను ఇప్పుడు పందెం లోకి వెళ్ళటం మానివేశాను. ఒక సైకిల్ ఫ్యాక్టరీ దివాళాతీసింది. వాళ్ళదగ్గర ఒక నూరు సైకిల్ ఫ్రేములు (బొద్దు) చాలా చౌకగా కొన్నాను. ఆ వెలను నెల నెల కింతింత అని చెల్లిస్తాంలే. ఇప్పుడు ముగ్గురు కుర్రాళ్ళు షాపులో పనిచేస్తున్నారు. మన షాపు బాగానేవుంది. కనుక దాన్నిగురించి నీవేమి బెంగపెట్టుకో వద్దు' అని విల్బర్ చెప్పాడు.

'సరే ! మనమూ గ్లయిడర్లను గురించి ప్రయత్నాలు చేస్తున్నామని ఆక్టేవ్‌కీ ఇంకావాళ్ళందరికీ ఉత్తరం వ్రాద్దాం ? మనకు పనికివచ్చే పుస్తకాలు పత్రికలు- ఏమయినా వుంటే వాళ్లు చెబుతారుగా !' ఆర్విల్ అన్నాడు.

ఆ తరువాత రెండు వారాలకి పోస్టులో గ్లయిడర్లను గురించి వ్రాసిన పుస్తకాలూ, పత్రికలూ వచ్చాయి. అందులోవి అన్నీ విజ్ఞానశాస్త్రం తెలిసిన ప్రొఫెసర్లు, ఇంజనీర్లు, పరిశోధనలు జరిపేవారు - వ్రాసిన వ్యాసాలు వున్నాయి. విజ్ఞానశాస్త్రం తెలిసినవాళ్ళు ఈ లోకంలో చాలా ఆశ్చర్యమైన మనుషుల్లా వుంది. వాళ్లు తమకు తెలిసినవి ఇతరులకు చెప్పి ఇతరుల దగ్గరనుంచి తెలియనివి నేర్చుకోవాలని చూస్తుంటారు. గాలికి ఎదురుగా మాత్రమే గ్లయిడర్ ఎగురగలదని ఒకరు అనుకుంటారనుకోండి. గాలిలోకి పోయేదాకానేగా దానిని ఆపగలిగేది. ఒక శాస్త్రవేత్తకి అలాంటి ఆలోచన వచ్చిందనుకోండి, అతను అది తనలోనే దాచుకోడు. తన ఆలోచనను గురించి యేదో పత్రికలో ఒక వ్యాసం వ్రాస్తాడు. అలాచేస్తే ఇతరులు కూడా తెలుసుకుని ఇంకా యేదైనా ఎక్కువగా వాళ్ళకు తోస్తే చెబుతుంటారు.

'ది రెయిల్‌రోడ్' మరియు 'ఇంజనీరింగ్ జర్నల్'లాంటి విజ్ఞానశాస్త్రానికి సంబంధించిన పత్రికలు ఇప్పుడు ఆర్వికి చాలా వస్తున్నాయి. ఆర్వికి విల్బర్‌కి యిద్దరికీ ఇరవయ్యేళ్లు

దాటినా ఇప్పటివరకూ స్కూల్లో ఒక్కరూ సర్టిఫికేటు యేదీ పుచ్చుకోలేదు. అంటే స్కూల్లో పరీక్షలకోసం వాళ్ళేమీ చదవలేదు. (వీళ్ళేమిటి, ఆ కాలంలో అమెరికాలో కొత్త కొత్తవి ఎన్నో కనిపెడుతూ వుండి విజ్ఞానశాస్త్రవేత్తగా లోకవిశ్రుతి జెందిన థామస్ ఎడిసన్ ఏ స్కూల్లో ఏ పరీక్షా ఎరగడు)

అయితే వాళ్ళు చదివే యీ పత్రికల్లో సంగతులన్నీ అర్థంకావాలంటే ప్రకృతిశాస్త్రం, ఇంజనీరింగ్, మేపను బొమ్మ గీయడం, విజ్ఞాన శాస్త్రము మొదలగు అవసరమయిన తొలి సూత్రాలయినా తెలిసివుండాలని విల్బర్, ఆర్విల్ అనుకున్నారు. అందుకని అందుకు కావలసిన పుస్తకాలు కొని చదివారు.

ఆర్విల్‌కి ఆ జబ్బు పూర్తిగా నయం కావటానికి చాలా కాలం పట్టింది. అయితే ఇందువల్ల బాగా పుస్తకాలు చదివి అప్పట్లో గ్లయిడర్లను గురించి దేశంలో యెక్కడెక్కడ ఏమి జరుగుతుందో అంతా తెలుసుకొనే అవకాశం కలిగింది అతనికి. పగలంతా ఆర్విల్ పుస్తకాలు చదివి రాత్రికి విల్బర్ రాగానే తాను తెలుసుకున్నదంతా అతనికి చెబుతూ వుండేవాడు.

ఈ విధంగా ఒక సంవత్సరం గడిచిపోయింది. వాళ్ళకి ఇప్పుడు వొకే కోరిక వుంది. మంచి గ్లయిడర్ తయారుచేసి మిగతావాళ్ళందరికంటే ఎక్కువ యెత్తున ఎగరాలి అన్నదే వాళ్ళ కోరిక.

'మనం ఎలాగయినా తయారుచేస్తాం' అన్నాడు విల్బర్.

'ఎగరగలుగుతా మంటావు' ఆర్వి అన్నాడు.

## గ్లయిడర్ నిర్మించారు

ఆ తరువాత ఒక సంవత్సరం గడిచింది. అప్పటిదాకా ఆర్విల్ ఇంట్లోనుంచి బయటికి వెళ్ళటంలేదు. ఆ వేళకూడా కాథరిన్, బలవంతాన అతన్ని వాళ్ళషాపుదగ్గరకు వెళ్ళనిచ్చింది. అతనికి మళ్ళీ ఓపిక వచ్చింది. ముగ్గురు-భలే సంతోషపడ్డారు. ఏదైనా కొత్త వస్తువులు తయారుచేయటం అంటే ఆర్విల్‌కి మహాసరదా. అది ఎంతో వుపయోగపడింది. అయితే చదవటంతోనే ఆర్విల్‌కి తృప్తివుండదు. ఏదయినా తయారుచేస్తేనే అతనికి బావుంటుంది.

ఆవేళ షాపుకివెళ్ళితే అతనికి ఎక్కడినుంచో తిరిగి సొంతయింటికి వచ్చినట్టనిపించింది. అతనికి అక్కడే ఎప్పుడూ వుండా లనిపించేది. అచ్చటి నూనె లన్నియు ప్రియమైన సువాసనలే.

అక్కడకు వెళ్ళగానే విల్బర్ అతన్ని వాళ్ళ పరిశోధనల పాకలోకి తీసుకుపోయాడు. అక్కడ ఒక పెద్దచుట్టగా చుట్టిపెట్టిన బట్ట, పొడుగుపాటి కర్రలమోపులు పెట్టి వున్నాయి. ఇవన్నీచూచి అతను ఏమో అనుకున్నాడు.

'నీవు వచ్చేసరికి ఇవన్నీ కొని తయారుగా వుంచుదామనుకొన్నాను' అన్నాడు విల్బర్.

'ఈ బట్ట, ఈ కఱ్ఱలు ఇక్కడ ఎందుకువున్నాయో ఎవరికయినా తెలుసా?' ఆర్వి అడిగాడు.

'మన కాథరిన్‌కి తప్ప ఇంకెవరికీ తెలియదు'.

'మీరు ఎక్కడికయినా వెళ్ళినప్పుడు వాడుకోటానికి గుడారాలు తయారుచేసుకొంటున్నా రని చెబుతున్నాలే' అన్నది కాథరిన్.

'ఈ సంగతి ఎవరికీ తెలియకూడదు. తెలిస్తే మనకు వొట్టి పిచ్చిపట్టిందని అనుకుంటారు'

'గుఱ్ఱబ్బళ్ళకు బదులు కార్లు వస్తున్నాయంటేనే నవ్వుతున్నారే, ఇక మీరు ఎగిరేబండి తయారుచేస్తున్నారంటే ఇంకేమనుకుంటారో యీ జనం?' అన్నది కాథరిన్.

'ఏమో, మనం ఎగిరిపోగలగవచ్చు'అన్నాడు విల్బర్.

'సరేలే, మీరిద్దరు ఏదైనా చేయబోతామంటే-అలా చేసే తీరుతారుకదూ' అన్నది కాథరిన్.

'నిజమే. కాని బొమ్మ నమూనాలుగూర్చి తగినంత శ్రద్ధ తీసుకోవాలి.'

వాళ్ళ బుఱ్ఱల్లో లెక్కలేనన్ని ఆలోచన లున్నాయి. ఆర్విల్ తెప్పించిన ఒక పత్రికలో మరొక కొత్త సంగతి కనపడింది. జర్మనీలో ఉర్టెంబర్గు అనే పట్టణంలో వొకాయన 'మోటారు పడవ' అని కొత్తది ఒకటి కనిపెట్టాడట. ఆ పడ

వలో పదకొండుమంది ఎక్కి ఒక సరస్సులో తిరుగుతూ ఉన్నట్టు బొమ్మకూడా వేశారు. పడవ చాలా పెద్దదేగాని దానికి వున్న ఇంజను మాత్రం చిన్నదే.

ఆ వారంలోనే 'బేర్నమ్‌బైలీ'వాళ్ళ సర్కసు (అమెరికాలో పెద్ద సర్కసు) వాళ్ళవూరు వచ్చింది. విల్బర్, ఆర్వి అది చూడటానికి వెళ్ళారు. అందులో గుర్రాలు, ఏనుగులు, సింహాలు, బఫూన్‌లు ఇవన్నీ వాళ్ళ కేమంత పట్టలేదుగాని గుర్రం లేకుండా నడిచే బండి కనపడేసరికి వాళ్ళకి భలేవింతగా తోచింది. అలాంటి బండిని వాళ్ళు చూడటం అదే మొదటిసారి. ఒక పెట్టెలాగావుంది. అది గుర్రం లేకుండానే కదిలిపోతూ వుంది. దానికి ఒక ఇంజను వుంటుందని, దానిపేరు మోటారు కారు అని సర్కసువాళ్లు చెబుతున్నారు. అటుపిమ్మట దానికి 'ఆటోమొబైల్' అను పేరు ఏర్పడినది.

ఆ తరువాత చాలా రోజులదాకా అదిచూచిన వారిద్దరికీ దాన్ని గురించిన ఆలోచనలే. 'ఇంజనుతో కార్లు నడుస్తున్నాయి. ఇంజను పడవల్ని నడుపుతూవుంది. ఇంకా కొన్నాళ్ళు వుంటే ఇంజనుతోనే గ్లయిడరుగూడా నడపవొచ్చు' అన్నాడు ఆర్విల్.

'అప్పుడుగాని సరైన 'విమానం' తయారుగాదు. గ్లయిడర్‌కి ఇంజను వుంటేగాని మన ఇష్టంవచ్చిన చోటికి గ్లయిడర్‌ని నడపటానికి వీలుండదు. దానికి పడవకుండు చుక్కానిలాంటిది వుండాలన్నమాట ' విల్బర్ సంతోషంగా అన్నాడు.

'ఇదంతా ఎందుకు–ఒకేసారి ఎగిరే ఇంజను తయారు చేద్దాం' ఆర్విల్ అన్నాడు.

విల్బర్ నవ్వాడు. 'కొంచెం ఆగు ఆర్విల్. త్వరపడతావేం. మొదట గ్లయిడర్ తయారుచేయాలి. లిలింటాల్ లాగా దాన్ని ఎగరవేసి చూడాలి. ఎగరటాన్ని గురించి అంతా నేర్చుకోవాలి. ఆ తరువాత ఇంజన్ల సంగతి తెలుసుకోవాలి' అన్నాడు.



ఆ మరునాడే వాళ్లు గ్లయిడర్‌కి నమూనా బొమ్మ వేస్తున్నారు. గ్లయిడర్‌ని గురించి షాన్యూట్, లిలింటాల్ ఇద్దరూ వ్రాసిన విషయాలన్నీ చదివారు. రెండు అరలు వుండే గ్లయిడర్ తయారుచేయాలని నిశ్చయించారు. బొమ్మ తయారవుతూ వుంది. అట్టిదానికి పిమ్మటిపేరు 'బై ప్లేన్'

'ఇది జాగ్రత్తగా తయారుచేయాలి. పగిలిపోయిందంటే బోలెడు డబ్బులు దండగ అవుతుంది' అన్నాడు విల్బర్.

'ఒక్కమాట చెబుతా విను విల్బర్. మనం బొమ్మ ఎంత బాగా వేసుకున్నా దాన్ని తయారుచేసి గాలిలో ఎగరవేసి చూచేటంతవరకు చెప్పలేం' ఆర్విల్ అన్నాడు.

'అది నిజమేలే' విల్బర్ అన్నాడు.

మన గ్లయిడర్ యీ చుట్టుపట్ల ఎక్కడా ఎగరవేయ కూడదు. ఇక్కడివాళ్లు చూస్తే నవ్వుతారు. అదీగాక ఇక్కడ కొండలు, చెట్లు ఎక్కువగా ఉన్నాయి. ప్రతిసారి గ్లయిడర్ అందులో ఇరుక్కుంటుంది. అంచేత ఒకటి రెండు కొండలు మాత్రమే వుండే మైదానంలోకి పోవాలి' ఆర్వి చెప్పాడు.

"అయితే 'స్మిత్‌సోనియన్' వాళ్ళకి వ్రాసి అలాంటి చోటు ఎక్కడ వుందో తెలుసుకుందాం" అన్నాడు విల్బర్.

అలానే ఆర్వీ ఉత్తరం వ్రాశాడు. అక్కడ వుండే ప్రొఫెసరు లాంగ్లే చాలా మంచివాడు. ఆయన దాన్ని వాతావరణం పరిశీలించే సంస్థకి పంపాడు. ఈ సంస్థని 'అమెరికా వాతావణం బ్యూరో' అంటారు. ఆ 'బ్యూరో' వాళ్ళు అమెరికాలో వున్న అలాంటి ప్రదేశాలు చాలావాటిని గురించి వ్రాశారు. ఆర్విల్, విల్బర్ ఆ ఉత్తరం జాగ్రత్తగా చదివారు.

'ఇదిగో ఇది చూడు 'కిట్టిహాక్' అనే యీ ప్రదేశం బావుంది' ఆర్వి చూపించాడు.

'కిట్టిహాక్ ? ఈ పేరు బావుందే !' విల్బర్ అన్నాడు.

'మనం ఇక్కడే ఒక గ్లయిడర్ తయారు చేసుకొని అక్కడికి పోయి ఎగరవేద్దాం' ఆర్విల్ అన్నాడు.

'శరదృతువు (ఆకులు రాలుకాలం) వచ్చేదాకా ఆగితే అప్పుడు సైకిళ్ళ బేరం తగ్గుతుంది. అప్పుడు వెళ్ళవచ్చు' అన్నాడు విల్బర్.

'ఈ సంగతి యెవరికీ తెలియకూడదు' ఆర్వి నొక్కి చెప్పాడు.

'కాథరిన్‌కి, నాన్నగారు వచ్చిన తరువాత వారికి-తప్ప ఇంకెవరికీ తెలియగూడదు' విల్బర్ అన్నాడు.

'అదే నేనూ చెప్పేది' ఆర్విల్ అన్నాడు.

ఆ వేసంగి అంతా బాగా పనిచేశారు. రోజూ ఆరు గంటలకే వెళ్ళి షాపులో కూర్చొని వచ్చిన బేరగాళ్ళు తిరిగి పోకుండా చూస్తుండేవాళ్ళు. రాత్రి ఎనిమిది గంటలు కాగానే షాపు మూసివేసి వెనుకప్రక్కవున్న పాకలోకి వెళ్ళేవాళ్ళు. అక్కడ యీ గ్లయిడర్‌పని మొదలుబెట్టేవాళ్ళు. ఒకొక్కనాడు అర్ధరాత్రిదాకా ఇంటికిపోయేవాళ్ళు కాదు. అయినా వాళ్ళు వచ్చేదాకా కాథరిన్ వాళ్ళకి వేడి వేడి భోజనం తయారుగా వుంచేది.

'గుర్రాన్ని యెక్కటం నేర్చుకోవటం యెలా ?' ఒక నాడు విల్బర్ అడిగాడు.

'గుర్రాలు స్వారీచేసే చోటుకి వెళ్ళి కంచెమీ దుండి వాళ్ళను చూస్తూ కూర్చుంటేసరి, అదే తెలుస్తుంది. అక్కడ స్వారీచేసేవాళ్ళు ఏమి పొరపాట్లు చేస్తున్నారో చూడాలి. అక్కడ గుర్రాలు వాళ్ళని క్రింద యెందుకు పడవేస్తున్నాయో చూడాలి. ఆ తరువాత అలాంటి పొరపాట్లు జరగకుండా మనం యెక్కి స్వారి చేయాలి' ఆర్విల్ చెప్పాడు.

'అదొక మార్గం. కొంతమంది శాస్త్రిలు తెలిసినవాళ్లు గ్లయిడర్ యెగరటంగూడా అలానే పరిశీలించి చూస్తూవుంటారు. కొందరు సరాసరి ఒకేసారి గుర్రాన్ని యెక్కి స్వారి చేయటం మొదలుబెడతారు. అలానే కొందరు గ్లయిడరుగూడా యెగర వేస్తారు. మనం యీ రెండు విధాలుగాసూ చేద్దాం. మన గ్లయిడర్ పూర్తికా వచ్చింది. మిగతాపని 'కిట్టిహాక్' వెళ్ళి అక్కడ చేసుకోవచ్చు. అక్కడికి వెళ్ళి చూచి అది బాగా ఎగిరితే మనం దానిలో యెక్కుదాం' అన్నాడు విల్బర్.

'అదే నేనూ అనుకొంటున్నాను' ఆర్విల్‌గూడా అన్నాడు.

'సరే - ఇంతకీ యీ కిట్టిహాక్‌కి వెళ్ళటం యెలా?' విల్బర్‌కి సందేహం వచ్చింది.

## కిట్టీహాక్

ఈ రోజుల్లో అయితే విమానంలో ఎక్కి డేటన్ నుంచి కిట్టిహాక్‌కి మూడు గంటల్లో వెళ్ళవచ్చు. అప్పుడు వాళ్ళకి ఆ ఏకాంతమైన బెస్తపల్లెను చేరటానికి వారంరోజులు పట్టింది. హాట్టేరాస్ అగ్రంనుండి అరవై మైళ్ళ దూరంలో కిట్టిహాక్ వుంది. హాట్టేరాస్ అగ్రం ప్రాంతంలో తుఫానులు ఎక్కువగా వుంటాయి. కిక్టీహాక్ అలాకాదు. అది చాలా ప్రశాంతంగా వుంటుంది. ఇది అట్లాంటిక్ సముద్రంలో వున్నది, కిట్టీహాక్ ఇసుక ప్రదేశం. చిన్న చిన్న కొండగుట్టలు వుంటాయి. చెట్లు మాత్రం వుండవు.

'ఇక్కడ బావుంది. ముఖ్యంగా ఇక్కడ మనుష్యు లెవరూ లేరు. ఇక్కడ మనల్ని చూచి పిచ్చివాళ్ళనుని అను కొనే వాళ్ళెవరూ లేరు. మన ఇష్టం వచ్చినట్లు ఎగరవేసుకో వచ్చు' విల్బర్ అన్నాడు.

వాళ్ళ గుడారం వెంట తెచ్చుకున్నారు. కావాలిసిన భోజన పదార్థాలన్నీ కాథరిన్ జాగ్రత్తగా కట్టి పంపించింది. వాళ్ళు తెప్పించిన పుస్తకాలన్నీ అన్నిరకాల పనిముట్లున్నీ వాళ్ళతోపాటే తెచ్చుకున్నారు. ఇప్పుడు వాళ్ళొక పెద్ద పరీక్ష చేయబోతున్నారు.

కిట్టిహాక్ వద్ద వాతావరణం పరిశీలించే ఆఫీసు ఒకటి, ప్రమాదం జరిగితే రక్షించే ఆఫీసు ఒకటి-వానికితోడు ఒక పోస్టాఫీసు తప్ప అక్కడ ఇంకేమీ లేవు. వీటన్నిటిమీద విలియం టేట్ అనే ఆయన పెత్తనదారుగా వుంటాడు. విల్బర్-ఆర్విల్ టేట్ వాళ్ళ ఇంట్లోనే భోజనాలు ఏర్పాటు చేసుకున్నారు.

వీళ్లు గ్లయిడర్ బిగించుకొంటున్నారు. ఇక్కడ సముద్రపు కాకులు తప్ప చూచి నవ్వేవాళ్ళెవరూ లేరు.

అది, చూడటానికి ఒక పెద్ద గాలిబుట్టలావుంది. క్రింద ఒకటి-పైన ఒకటి, రెండు రెక్కలుమాత్రం వున్నాయి. టేట్ కి నాల్గు ఐదు జాబులు ఒప్పగించడంతప్ప అక్కడ పెద్ద పనేమి వుండదు. అతను వీరు చేసేవన్నీ శ్రద్ధగా చూస్తుండేవాడు. అతను ఎప్పుడూ నవ్వేవాడుకాదు. తనవలన ఏమయినా సహాయం కావాలిసివుంటే చేస్తాననిగూడా అనేవాడు.

ఇప్పుడు వాళ్ళకొక మనిషి తోడుకావాలి. 'గుఱ్ఱం' ఎక్కేవిధం నేర్చుకున్నారు. దాని వీపుమీదకెజారి నిలువుగ ఉండాలి. ఇప్పుడు గ్లయిడర్ ఎక్కవలసివుంది. వాళ్లిద్దరిలో ఒకరు ఎక్కి దాన్ని ఎగిరిస్తుంటే మరొకరు క్రిందవుండి చూడాలిసివుంది. అయితే గ్లయిడర్ బయలుదేరేదాకా దాన్ని లాగటానికి ఇద్దరు మనుషులు కావాలి. గాలిపటం లాగినట్టే ఇదీ లాగాలి. దానిలో ఎవరు ఎక్కాలని తేల్చుకోటానికి వాళ్ళు

చిత్తు ఎగరవేశారు. ఆర్విల్‌కి వచ్చింది. అంటే అతను మొదట గ్లయిడర్ ఎక్కుతాడన్నమాట.

ఆటో లిలింటాల్‌వంటి వాళ్ళు గ్లయిడర్ క్రింది రెక్క మీద నిటారుగా కూర్చునేవాళ్ళు. విల్బర్‌కి వెనుక వాళ్ల అమ్మ చెప్పిన మాట ఒకటి జ్ఞాపకంవచ్చింది. ఎదురుగాలిలో ముందుకు వంగితే తేలికగా పోవచ్చు. ఆర్విల్ సైకిల్ పందెంలో హాండిల్ మీదికి వంగటంవల్ల ఎంత వేగంగా పోగలిగిందీ జ్ఞాపకం వచ్చింది.

'దానిలో బాగా ముందుకు పడుకో ఆర్వ్. అలా అయితే బాగా వేగంగా పోవచ్చు,' అని చెప్పాడు. గ్లయిడరు ఒక ఇసుక దిబ్బమీద ఉంచబడింది.

ఆర్వ్, సరేనని తల వూపుతూ గ్లయిడరులో ఎక్కాడు. విల్బర్, డేట్ ఇద్దరూ గ్లయిడర్‌కి చెరొకవేపు నిలుచున్నారు. విల్బరు మునుపే ఇరుప్రక్కలకు గట్టిత్రాళ్ళు కట్టినాడు. ఇపుడు వాడును, డేట్‌ను పట్టుకొని ఉంటారు కొసలను.

'మనం ఇద్దరం కొండమీదనుంచి దీనిని వదిలిపెడదాం.........ఆ తరువాత..........అదేమో ఎగిరి పోతుంది. ఊఁ సరేనా ? ఒకటి........రెండు........మూడు.......పో' అంటూ గ్లయిడర్ తాళ్ళు లాగుతూ పరుగెత్తుతున్నారు. 'గ్లయిడర్ ఎగురుతోంది' అని ఆర్విల్ అరిచాడు. అది క్రమంగా పైకి పోతోంది. మెల్లమెల్లగా తాళ్ళు విడిచిపెడుతున్నారు. వంద అడుగుల

వరకు బాగా వెళ్ళింది. అక్కడికి పోగానే ఒక పెద్ద గాలివచ్చి దాన్ని దాదాపు క్రిందికి వాలేట్లుచేసింది. మరొక గాలి తెర వచ్చేసరికి భూమిమీద వాలిపోయింది. ఆర్విలికి దెబ్బేమీ తగలలేదు. 'గ్లయిడర్ మాత్రం పాడయింది. అయితే అందుకు వాళ్ళేమీ విచారపడలేదు.

'మనం మనుషుల్ని మోసే గాలిపటం తయారుచేశాం,' అంటూ ఆర్వి హుషారుగా అన్నాడు

'బాగుచేసి మళ్ళీ ఎగరవేద్దాం' విల్బర్ అన్నాడు.

గ్లయిడర్ కి కట్టిన బట్ట చాలచోట్ల చిరుగులు పడినట్లు టేట్ చూచాడు.

'అబ్బాయిగారూ, మీలో ఎవరికయినా బట్టలమిషన్ కుట్టటం చేలొచ్చా ? అని అడిగాడు.

'ఓ ! ఎందుకు చేతరాదు ?' ఆర్వి అన్నాడు.

'అయితే మా యింట్లో కొత్త కుట్టుమిషన్ వుంది. ఈ....రెక్కల్లో చిరుగులన్నీ చేత్తో కుట్టాలంటే చాలకాలం పడుతుంది. దానిమీద అయితే కాసేపట్లో అయిపోతుంది' టేట్ కూడా వాటిని 'రెక్కల'నే అన్నాడు. కొందరు గ్లయిడర్ అంటారు. కొందరు గాలిబుట్ట అంటారు. ఎలాగయినా కానీ ఆర్విల్ రెక్కలమీద ఎగిరాడు. అతను ఎగరగలిగింది పది క్షణాలే. అయినా అతను ఎగరగలిగాడు.

ఆ మరునాడు విల్బర్ ఎక్కాడు. క్రిందటిరోజు ఆర్వి కంటే విల్బర్ ఈ రోజు ఎక్కువసేపు గాలిలో ఎగరగలిగాడు. ఇలా ప్రతిరోజూ ఎగరవేసి చూస్తున్నారు. క్రిందవుండే అతను ఎగిరే గ్లయిడరుచూస్తూ ఏమి జరుగుతుందా అని గమనిస్తుంటాడు. అలాచూచి, వారు చాల సంగతులు తెలుసుకోగలిగారు. గాలి సరిగావుంటే గంటకు పదిమైళ్ళ వేగంతో ఎగరవచ్చునని తెలుసుకొన్నారు. గాలిబుట్టలు ఎగరటంలో అటూ ఇటూ ఒరిగిపోకుండా సమంగా నిలపటం చాల ముఖ్యమైనదని గమనించారు. ఒక్క గాలిపటమేగాదు. ఎగిరేవి ఏవయినా అంతే. పిట్టలుకూడా అంతే. పెద్ద గాలితెరవచ్చి నప్పుడెల్లా గ్లయిడరు ప్రక్కకయినా తిరిగిపోతుంది; నేలమీదకయినా దిగిపోతుంది.

'గ్లయిడరు కుడివేపుకు వాలిపోయిందనుకో. అప్పుడు మనం ఎడంప్రక్కకు ఒరిగితే అది మళ్ళ సమంగావస్తుంది' విల్బరు ఆలోచించి చెప్పాడు.

ఆ మరునాడు ఎగిరినప్పుడు ఆర్వి అలాచేసి చూచాడు. కాని అదేమంత బాగా పనిచేయలేదు. అలా చేసినాకూడా గ్లయిడరుని త్రిప్పటం చేతరాలేదు. గాలి ఎటుతీసుకుపోతే అటు పోతూనేవుంది.

ప్రతిరోజూ రాత్రి భోజనాలు అయిన తరువాత టేట్ వాళ్ళవద్ద కూర్చొని విల్బరు, ఆర్విల్ ఇద్దరూ ఆరోజు జరిగిన పొరపాట్లుగురించి ఆలోచించుకుంటూ వుండేవాళ్ళు. అవన్నీ ఒక కాగితంమీద వ్రాసుకునేవాళ్లు. వాళ్ల గ్లయిడరు రెక్కలకి

'సాటిన్' గుడ్డ వుపయోగించారు. అది ద్రాహపు సిల్కులాగానే వుంటుంది. ఈ సాటిన్ గుడ్డలోనుంచి కొంతగాలి దూరిపోతుం దని తెలుసుకొన్నారు. అంచేత అంతకంటేకూడా గాలిని చొర నీయకుండావుంచే బట్ట ఏదయినావుంటే బావుంటు ననుకున్నారు. ఏదో ఒకరకంగా గ్లయిడరుని సమంగా నిలిపే ఏర్పాటుకూడా చేయక తప్పదనుకున్నారు.

'అప్పుడు మనస్లెడ్జికిచేశామే. అలాంటి చుక్కాని ఒకటి చేసిపెడదాం?' అని ఆర్వి అన్నాడు. విల్బరుకికూడా ఈ ఆలో చన బాగానేవుంది.

'అడ్డంగావుండే చుక్కాని తయారుచేద్దాం. అలా అయితే క్రిందికీ పైకీ వెళ్లటానికి వీలుంటుంది. దాన్ని ఎటు కావాలంటే అటు సర్దుకోటానికి వీలుగాచేయాలి. ఒకవేపుకి త్రిప్పితే పైకి, మరొకవేపుకి త్రిప్పితే క్రిందికి పోయేలాగా వుండాలి' ఆర్వి వివరంగా చెప్పాడు.

ఇలా అనుకొని మూడురోజుల్లో ఒక చుక్కాని తయారు చేశారు. దీన్ని గ్లయిడర్‌కి వెనుకభాగాన గాక ముందుప్రక్క బిగించారు. ఇందులో మనిషి ముందుభాగంలో కూర్చుంటాడు. అంచేత వెనుక ఎక్కడో అది వుంటే దాన్ని త్రిప్పటానికి వీలుండదు. అందుకని అలా బిగించారు. దీన్ని 'ముందు పైకెత్తే చుక్కాని' అన్నారు. (మీరు ఎప్పుడయినా విమానందగ్గరకు వెళ్లితే విమానంనడిపే పైలట్‌ని అడిగితే దీన్నిగురించి మీకు బాగా చెబుతాడు.)

ఆ రోజు విల్బర్ ఎక్కవలసివుంది. పేట్ కూడా వాళ్ళకి తోడుగా వచ్చాడు. నవంబరు నెల వచ్చింది. అంచేత గాలి గట్టిగా వీస్తోంది. చలికాలం రాబోతూం దన్నమాట. ఈ సారి గ్లయిడర్ త్వరగానే గాలిలోకి ఎగిరిపోయింది. నేలమీదనుంచి పదిహేను అడుగుల ఎత్తుకుపోయిన తరువాత విల్బర్ చుక్కాని త్రిప్పిచూచాడు. అలా త్రిప్పగానే గ్లయిడర్ బుర్రున మరొక పదిహేను అడుగుల పైకి పోయింది. ఈ సారి చుక్కాని రెండో వైపుకి లాగిచూచాడు. గ్లయిడరే క్రిందికి దిగింది. మళ్ళీ పైకి లేచేలాగా చేయాలని చుక్కానికి కట్టిన తాళ్ళు లాగాడు. కాని అందులో ఒకటి తెగిపోయింది. అందువల్ల గ్లయిడర్ వచ్చి నేలమీద ఇసుకలో కూరుకుపోయింది.

ఆర్వి భయపడి అక్కడికి పరుగెత్తి చూచాడు. విల్బర్ కి ఏమీ దెబ్బతగల్లేదు. విల్బర్ నవ్వాడు.

'ఆఁ ఇక ఫరవాలేదు. దీన్ని క్రిందికీ పైకే త్రిప్పటం ఇక మన చేతుల్లోనే వుంటుంది. ఇక చెయ్యసినట్టైతే' విల్బర్ హుషారుగా అన్నాడు.

'కాని గ్లయిడర్ చూచావా ?' పూర్తిగా పాడయిపోయిన గ్లయిడర్ చూపుతూ అన్నాడు.

'ఓస్ ఇంతకంటే మంచిది తయారుచేయొచ్చు. పేట్! ఈ గుడ్డ అంతా తీసుకుపోయి మీరు ఉపయోగించుకోండి' అన్నాడు విల్బర్.

'సరేలెండి మా చిన్నపిల్లకి గౌనులయినా అవుతాయి' సంతోషపడుతూ టేట్ అన్నాడు.

'మేం ఇక మా వూరు వెళ్లిపోతున్నాం టేట్, మళ్లీ వచ్చేసంవత్సరం వస్తాంలే!' విల్బర్ అన్నాడు.

సామాను అంతా సర్దుకుని ప్రయాణం అయ్యారు. ఆ రోజు టేట్ వాళ్ల అమ్మాయి వీళ్లని చూడటానికి వచ్చింది. గ్లయిడర్ రెక్కలకు పనికివచ్చే బట్ట తాను గౌనువేసుకున్నానని ఆ పిల్లకేం తెలుసు పాపం! గాలి విసురుతో సంబంధంలేకుండా ఎగర గలిగిన మొదటి గ్లయిడర్ ఇదే.

# అంతకంటె మంచి గ్లయిడర్

ఇంటికి వచ్చారు. షాపు తెరిచారు. వాళ్ల షాపులో వాడుకగా కొనేవారు ఒకరువచ్చి 'ఇన్ని రోజులు ఎక్కడికి పోయారయ్యా?' అని అడిగాడు. 'మేం పొరుగూరు వెళ్లాంలే' అన్నారు.

నిజమే. ఇన్నాళ్లు వాళ్లు కిట్టీహాక్‌లో మకాం పెట్టుకున్నారు. వాళ్ల చెల్లాయికి, నాన్నకు మాత్రమే జరిగిన సంగతి అంతా వివరంగా చెప్పారు. అప్పటివరకు ప్రపంచంలో ఎవరూ చేయని పనులు రెండు చేశారు. గ్లయిడర్ క్రింది రెక్కమీద కూర్చొని ఎగిరారు. వాళ్ల గ్లయిడర్‌కి చుక్కానికూడా పెట్టగలిగారు. వాళ్లవూళ్ళో వాళ్ళంటే సైకిళ్లు బాగుచేసుకునేవాళ్లు అని మాత్రమే తెలుసు. కాని అంతవరకు ఇంజనీర్లుగాని, శాస్త్రాలు తెలిసినవారుగాని ఎవరూ చేయలేనిపని చేశారు వాళ్లు.

ఇంగ్లండులో హిరామ్ మాక్సిమ్ అనే అతను ఎగిరే మిషన్లను గురించి ప్రయత్నం చేస్తున్నాడు. ఆ దేశపు ప్రభుత్వం అతనికి కావలసిన డబ్బుయిచ్చి సహాయపడుతున్నది. అయినా అప్పటివరకు అతను ఎగరటం జరగలేదు. కొన్ని నమూనాలు తయారుజేసి వాటిని ఎగరవేసి చూస్తున్నాడు,

అంతే. ఇవి గాలిలో ఎలా ఎగిరిందీ వివరంగా పత్రికల్లో వ్యాసాలు వ్రాస్తూ ఉండేవాడు.

ఒకసారి విల్బర్ మాక్సిమ్ వ్రాసినవ్యాసం ఒకటి చదివి 'గుర్రపుస్వారి నేర్చుకోవాలంటే గుర్రంమీద ఎక్కాలింసిదే' అన్నాడు.

'సైకిలుకూడా అంతే. నాలుగుసార్లు ఎక్కి క్రిందపడి అయినాసరే నేర్చుకుంటేనే అది వచ్చేది' అన్నాడు ఆర్విల్. చికాగోనుంచి ఆక్టేవ్‌షన్యూట్ వ్రాసే వ్యాసాలు చాలా చదివారు. అయితే మాక్సిమ్‌లాగా నమూనాలుచేసి పూరుకోలేదు. అతను అరవయ్యేళ్ల ముసలివాడు అయినా గ్లయిడర్లు తయారుచేసి వాటిలో ఎక్కి ఎగిరి చూచాడు. విల్బర్ ఆర్విల్ కిట్టిహాక్‌లో జరిగింది అంతా షాన్యూట్‌కి వ్రాస్తూ ఉన్నారు. వీళ్ళ కథ అంతా విని షాన్యూట్ ఆశ్చర్యపడ్డాడు. షాన్యూట్ మామూలు మనిషికాదు. అతను పెద్ద ఇంజనీరు. షాన్యూట్ తానుగాని, ఆటోలిలింటాల్‌గాని చేయలేకపోయిన పని ఈ సైకిల్‌షాపు కుర్రవాళ్ళు చేశారే అని విస్తుపోయాడు. వీళ్ల పనికి వీళ్లని ఎంతో మెచ్చుకుంటూ పెద్ద ఉత్తరం వ్రాశాడు. అందులో తాను తెలుసుకొన్న కొత్త సంగతులుకూడా కొన్ని తెలిపాడు.

షాన్యూట్ వ్రాసిన సంగతులన్నీ జాగ్రత్తగా ఆకళింపు జేసుకొన్నారు. మళ్లీ పని మొదలుబెట్టారు. క్రిందకీ పైకీ మనం కోరినట్టు పోయే గ్లయిడర్ తయారుజేశారు. అయితే ప్రక్క

లకుకూడా తిరిగే ఏర్పాటు ఉండటం ఎలానా అని ఆలోచించారు. మళ్లీ పక్షులు ఎలా ఎగురుతున్నాయో; ప్రక్కకు తిరిగినప్పుడు ఎలా తిరుగుతున్నాయో గమనించారు. గ్లయిడర్‌కు లేని సౌకర్యం పక్షులకి వుంది. పక్షి కోరినప్పుడు రెక్కల్లో ఒకదాన్ని క్రిందికి వంచివేయ గలుగుతుంది. గ్లయిడర్‌కి కూడా అలా కదలటానికి వీలువుండే రెక్కలువుంటే మంచిదనుకున్నారు. కాని అది చేతగాని పని అనుకున్నారు.



గ్లయిడర్ ఒరిగిపోకుండా సమంగా నిలిపే ఏర్పాటుకూడా కావాలి. అందులో కూర్చున్నవాళ్లు ప్రక్కలకు ఒరిగినందు వల్ల సమంగా ఉంచటం మంచి పనిగాదు.

'మరీ-ఇంకొక చుక్కాని నిలువుగా తయారుచేసి పెడితే ఒరిగిపోకుండా నిలపవచ్చేమో,' ఆర్విల్ అన్నాడు.

'కావచ్చు. ఈ సారి కిట్టిహాక్ వెళ్ళినప్పుడు అదీ ప్రయత్నంచేసి చూద్దాం. ముందు దాని నమూనా తయారు చేసుకుందాం' విల్బర్ అన్నాడు.

ఈ రెండో చుక్కాని వెనుకవేపు వుండాలా, ముందు ప్రక్క వుండాలా అనే సందేహం వచ్చింది. దీనిని వెనుకవేపు పెట్టి చూడాలనుకున్నారు. రెండూ వెనుకభాగాననే పెడితే ఎలా వుంటుందా అనుకున్నారు. బొమ్మగీశారు. తోక నమూనాగీశారు. (ఈసారి దాదాపు విమానం తయారు అయిపోయినట్టే)

(విమానంచూచే అవకాశం కలిగినపుడు తోకను గమనించుడు. అందు పైకి క్రిందికి ఇరుప్రక్కలకును త్రిప్పు చుక్కానీలు రెంటిని చూడుడు )

'ఈసారి తయారుచేసే గ్లయిడర్ పెద్దదిగా చేద్దాం. రెక్కలు ఇంకా వెడల్పుగా వుంటే ఇంకా ఎక్కువసేపు గాలిలో నిలుస్తుంది' విల్బర్ అన్నాడు.

'ఇంకా పైకికూడా పోతుంది' అన్నాడు ఆర్విల్.

'ఆఁ త్వరగా చచ్చిపోవచ్చుకూడా,' మధ్యలో కాథరిన్ అందుకుంది. కాథరిన్ ఇప్పుడు చిన్న పిల్లకాదు. ఒక హైస్కూల్లో టీచరుగావుంది. అయినా ఇప్పుడు ఇంట్లోపనులన్నీ

ఆవిడే చూస్తోంది. విల్బర్, ఆర్విల్ ఏదివచ్చినా కాథరిన్‌ని అడిగేవాళ్ళు.

'మేం జాగ్రత్తగానే వుంటాంగా కేట్' ఆర్వి హామీ యిస్తున్నట్టుగా అన్నాడు.

'ఆః ఆటోలిలింటాల్ జాగ్రతగావుండే చచ్చిపోయాడు' అన్నది కాథరిన్.

'పైకి ఎంత ఎత్తుకుపోతే అంత ప్రమాదం వుంటుంద'ని వాళ్ళకితెలుసు. అయినా ఈపని చేయాలిసిందే ననుకున్నారు.

ఆతరువాత మళ్ళా రెండుసార్లు కిట్టిహాక్‌లో మకాంవేసి వచ్చారు. ఈసారి తయారుచేసిన గ్లయిడర్ మొదటిదానికంటే గట్టిదీ, పెద్దది. అయితే ఈ రెండోచుక్కాని పనిచేస్తుందోలేదో తెలియదు. ఒకసారి ప్రయత్నించి చూచారు. బాగానే పనిచేసింది. ఈసారి మూడువందల అడుగుల ఎత్తువాకా వెళ్ళి వచ్చారు. ఇంత ఎత్తుదాకా ఇంతకుముందు ఎప్పుడూ ఎవరూ ఎగరలేదు. కాని ఈసంగతి ఎవరికీ చెప్పలేదు. కేట్‌కిమాత్రం తెలుసు.

'ఈ రెండోచుక్కాని (నిలువుది) కూడా త్రిప్పటానికి వీలుగాచేస్తే మన గ్లయిడర్ ఎటుబడితే అటు త్రిప్పుకోవచ్చు' అన్నాడు ఆర్విల్. వాళ్ళకి అదొక కష్టమైన పనిగాదు. అనుకున్నట్టు తయారుచేశారు. ఈరెండు చుక్కానీలు పెట్టటంతో వీళ్ళ గ్లయిడర్ ప్రమాదానికి అవకాశం లేకుండా తయార

యింది. ఇప్పుడు వున్నట్టుండి పైకి, క్రిందకి పోవటంలేదు. మధ్యలో తొట్రుపడడం లేదు.

'రోజూ ఎగరవేసి చూడాలి' విల్బర్ అన్నాడు.

'బాగా నేర్చుకొని సైకిలు తొక్కినంత తేలికగా గ్లయిడర్‌లో ఎగరగలగాలి.' అన్నాడు ఆర్విల్.

రోజూ అనేకసార్లు ఎగురుతున్నారు. ప్రమాదాలనుండి రక్షించే ఆఫీసులోవాళ్ళ పిల్లలకి ఇది చూడటానికి సరదాగా వుంది. వాళ్ళు వీళ్ళకి ఎప్పుడూ తోడ్పడుతూ వుండేవాళ్ళు.

ఇప్పుడు విల్బర్, ఆర్విల్ ఇద్దరూ బాగా అలవాటు పడ్డారు. ఇప్పుడు ఎటుకావాలంటే అటు త్రిప్పగలరు. ఇదివరకు చుక్కానీలు త్రిప్పటానికి తాళ్ళుగట్టేవాళ్ళు. ఇప్పుడు వాటికి పియానోవాద్యపు తీగెలు కట్టారు. ఈ తీగెలకి చిప్పు కూడా ఏర్పాటుచేశారు.

ఈసారి ఆరువందల ఇరవయిరెండు అడుగుల ఎత్తుదాకా ఎగిరారు. గాలిలో ఇరవై ఆరుసెకండ్లవరకు అలానే నిలిచివుంది. ఇంకా ఎక్కువకాలం గాలిలో వుండేట్లు చేయాలనుకున్నారు. అక్కడికి రెండుమైళ్ళ దూరంలో ఇంకా ఎక్కువగా ఇసుకదిబ్బ వుండే ప్రదేశంవుంది. అక్కడికి వెళ్ళారు. ఇదివర కెన్నో సూరు అడుగుల ఎత్తునుంచి పడితే చచ్చిపోతామని, ఇరవై అడుగుల ఎత్తునుంచిపడితే కొద్దిగా దెబ్బతగ్గ్రం

తగులుతుందని అనుకొంటూ వుండేవాళ్ళు. ఇక ఇప్పుడు ఆ భయంలేదు. వాళ్ళ గ్లయిడర్ వాళ్ళు చెప్పినట్టు వింటుంది.

ఒకనాడు ఆర్వి గ్లయిడర్ ఎక్కాడు. ఒక పెద్దగాలి తెర వచ్చి అమాంతంగా రెండువందల అడుగుల ఎత్తుకి పోయింది. అప్పుడుగనుక క్రిందికిచూస్తే అతను భయపడే వాడే. అయితే చేతిలో రెండుచుక్కానులు వున్నాయికదు! అతనికేమీ భయం అనిపించలేదు. తరువాత చుక్కాని త్రిప్పి ఇంకా యాభయి అడుగులు పైకి ఎగిరేట్లుచేశాడు. ఆతరువాత గాలి పూర్తిగా ఆగిపోవటంవల్ల గ్లయిడర్ క్రిందకు దిగింది. ఈసారి పైన యాభయి సెకండ్లసేపు వుండగలిగాడు. లిలింటాల్‌కూడా ఎప్పుడూ ఇంతసేపు పైనే వుండగలగలేదు.

'ఇంకా దీనికి చాలాచేయాలి. అడ్డంగావుంచే చుక్కాని జములుగావుంటే ఇంకా పైకిపోవచ్చు.' ఆర్విల్ చెప్పాడు.

'నాకూ ఇంకొక ఆలోచన పుట్టింది. ఇవన్నీ ఇంటికి వెళ్ళిన తరువాత చూద్దాంలే' అన్నాడు విల్బర్.

మళ్ళీ ప్రయాణమై వాళ్ళవూరు వెళ్ళారు.

# వాళ్ళు ఇంజను తయారు చేశారు

ఆ తరువాత కొన్ని సంవత్సరాలు చాల హుషారుగా గడిచింది. చికాగోనుంచి షాన్యూట్ వీళ్ళని చూడటానికి వచ్చాడు. ఆయన తానుచేసిన పరిశోధనలను గురించి వాళ్ళతో చెప్పాడు. ఆయన తయారుచేసిన మొదటి గ్లయిడరుకు అయిదు రెక్కలు వున్నాయట. మరొకదానికి మూడు రెక్కలు పెట్టి చూచాడట. అవన్నీ బరువైపోయాయని చెప్పాడు. చివరకి క్రింద ఒకటి పైన ఒకటి రెండు రెక్కలు మాత్రమే పెట్టటం మంచిదని తెలుసుకున్నానని చెప్పాడు. విల్బర్, ఆర్వీ చేసింది కూడా అలాంటిదే. ఆయన అప్పటికి రెండువందలదాకా గ్లయిడర్లు తయారుచేశాడట. కాని ఒకటికూడా విల్బర్ వాళ్ళుచేసిన దానంత గట్టిగాలేదని ఆయన చెప్పాడు.

షాన్యూట్ ఓపికచూచి విల్బర్ ఆర్వీలకి ఆశ్చర్యం వేసింది. వాళ్లు ఆయనను చాల మెచ్చుకున్నారు. షాన్యూట్ ముప్ఫయి సంవత్సరాలనుంచి గ్లయిడర్లు తయారు చేయటమే పనిగా పెట్టుకున్నాడు. కాని ఆయన తన అరవయ్యోయేడు దాటిన తర్వాతగాని గ్లయిడర్ మీద ఎక్కిచూడటానికి సాహసించలేక పోయాడు. ఆయనకి ఇప్పుడు డెబ్బయి ఏళ్లు దగ్గర

పడుతున్నాయి. ఇప్పటికీ గ్లయిడర్ల మీద ఎక్కి ఎగురుతూనే వున్నాడు.

'మీరు చాల గొప్పపనిచేశారు. మీగ్లయిడర్ చాల గట్టిగా చేయగలిగారు. మీకు నేను చేతనయిన సహాయంచేస్తాను. మీకు కావాలసిన డబ్బు ఇస్తాను. సైకిలుషాపు మానివేసి ఇక ముందు అచ్చుగా ఈపనేచూడవచ్చు' అని ఆయన చాల ఉత్సాహంతో చెప్పాడు.

విల్బర్ నవ్వాడు. 'మేం ఎప్పుడూ ఎవరిదగ్గరా అప్పు తీసుకొని ఎరగం. మాఅమ్మను మాత్రం అడిగి ఒకటి రెండు సార్లు తీసుకున్నాం. అంతే. అయినా ఇప్పుడు మేం ఏమీ చేయబోవటంలేదు' అన్నాడు.

ఆ తరువాత చాల రోజులుదాకా కనపడిన ఇంజన్లు అన్నిటినీ జాగ్రత్తగా పరిశీలించటం మొదలుబెట్టారు. గ్లయిడర్‌ని ఎదురుగాలిలో కూడా తేలికగా మోసుకుపో గలిగినంత పెద్ద ఇంజను వాళ్ళకు కావాలి. అంతపెద్దది అయినా మళ్ళీ తేలికగా వుండాలి. బరువు ఎక్కువ కాకూడదు.

వాషింగ్టన్‌లో ప్రొఫెసర్ లాంగ్లీ తానొక ఎగిరే మిషన్ తయారు చేసినట్టు ప్రకటించాడు. కాని దానిని గాలిలోకి ఎగిరించటం అతనివల్ల కాలేదు. ఎన్నిసార్లో ఎగిరించాలని చూచాడు. కాని అది చాలబరువైనందున నేలమీదనుంచి పైకి లేపలేదు.

ఆ రోజుల్లోనే ఫ్రాన్సు దేశంలో సంతాస్ - డ్యూమంట్ (Santos-Dumont -సంతోద్విమో అని ఉచ్చారణ) అనే ఒక యువకుడు ఒక గాలిబుట్టకి ఇంజను అమర్చి దాన్ని ఎగిరించ గలిగాడు. కాని ఇది చాలనెమ్మదిగా పోతోంది. ఎదురుగాలిలో ఇది కదలలేక పోతూంది. పైగా ఇది గాలికంటే తేలికయిన వస్తువు అయింది. విల్బర్, ఆర్వీలు అలాకాదు. గాలి కంటే బరువైన ఇంజన్ తయారుచేయాలని చూస్తున్నారు.

అయితే వాళ్ళ ఆలోచనలను ఎవరికీ తెలియ నీయటం లేదు. 1900 సంవత్సరంలో ఎవరయినా 'మనిషికూడా ఎగిరిపో వచ్చు' అని అంటే విన్నవాళ్ళు నవ్వేవాళ్ళు. విజ్ఞానశాస్త్రం తెలి సినవాళ్ళే నవ్వేవాళ్లు. ఇక ఒట్టివాళ్ళ సంగతి చెప్పేదేముంది? ఒక శాస్త్రవేత్త ఒక పత్రికలో వ్యాసం వ్రాశాడు. మనిషి యింకా వెయ్యి సంవత్సరాలకయినా ఎగరలేడని ఆయన వ్రాశాడు. వాషింగ్టన్ ప్రొఫెసర్ లాంగ్లీని అందరూ హేళన చేస్తుండేవాళ్ళు.

షాన్యూట్ మాత్రం అలాకాదు. విల్బర్, ఆర్వీలు చాల తెలివైన వాళ్ళని అతనికి తెలుసు. వాళ్ళకు ఇతరులు ఎవరూ నేర్పక పోయినా గ్లయిడర్లు ఎగరటం, ఎగిరే వస్తువులకు వుండా లిసిన నడింపు మొదలయిన సంగతులన్నీ శాస్త్రవేత్తలకంటే వాళ్ళకే బాగా తెలుసునని షాన్యూట్ నమ్మకం-ఈ ప్రపంచంలో పైలట్లందరిలోనూ వాళ్ళిద్దరే చాలా గొప్పవాళ్ళని అనేవ

గుర్తించాడు. వాళ్ళు అప్పటికే వేయిసార్లయినా గ్లయిడర్‌లో ఎగిరి వుంటారు. వాళ్ళకు దాని లోతుపాతులు బాగా తెలుసు.

ప్రతిసారి కిట్టిహాక్‌కి వెళ్ళాలంటే చాలదూరం. అంచేత వాళ్ళ వూళ్ళోనే ఒక పశువుల మైదానంమీద ప్రయత్నం చేసి చూస్తున్నారు. ప్రతిసారి ఒకరుమాత్రం అందులో ఎక్కేవాళ్లు. బరువు పెంచటానికని ఒక సంచినిండా ఇసుకపోసి అదికూడా అందులో పెట్టేవాళ్ళు. గ్లయిడర్ ఒక మనిషినేగాక మరొక నూరుపౌనుల బరువును కూడా అదనంగా మోయగలదని తేల్చుకున్నారు. కారు ఇంజను చాల బరువుగనుక అది పనికిరాదు.

మెల్లి మెల్లగా వాళ్ళు గ్లయిడర్‌లో మార్పులు చేస్తూ వున్నారు. మరింత గట్టిగానూ, తేలికగాను చేయటానికి ప్రయత్నిస్తున్నారు. ఆ తరువాత రెండువందల పౌనుల బరువువేసినా అది మోయగలిగింది. ఇప్పుడు రెండువందల పౌనుల బరువు గలిగిన ఇంజను అయినా పనికి వస్తుందని తేల్చుకున్నారు. అయితే అంత తేలికగావుండే ఇంజను ఎక్కడా తయారు కాలేదు.

'మనమే ఒకటి అలాంటిది తయారు చేద్దాం' అన్నాడు ఆర్వీ.

'నేనూ అదే అనుకుంటున్నాను. ఇతరులు చేసింది మనకు ఏది పనికివచ్చింది గనుక?' అంటూ విల్బర్ నవ్వాడు.

వాళ్ళు పాకలోకూర్చుని ఇంజను తయారుచేయటం మొదలు బెట్టారు. ఈ రోజుల్లో విమానాలకు వుండే ఇంజన్ల వంటివే వాళ్ళు అప్పుడు తయారు చేశారు. అది గాసోలయిన్‌తో పనిచేస్తుంది. దానికీ ఒక కార్బురేటరు, స్పార్కు ప్లగ్గులూ అన్నీ వున్నాయి. అయితే దానంతట అదే సాగేట్టు చేసే సెల్ఫ్‌స్టార్టరు ఆ కాలంలోలేనిది - దానిలోనూ లేదు. ఒక్కొక్కనాడు వాళ్ళ కంపెనీప్రక్కగా పోయేవాళ్ళకి తుపాకి మోతలాంటిది ఆ పాకలోనుంచి వినపడేది. ఇదేమిటో తెలిసేది కాదు.

'ఆ పిల్లకాయలు మళ్ళీ ఏమిటో చేస్తున్నారు లాగుందే!' అనుకుని నవ్వుతూ వెళ్ళేవాళ్ళు.

వాళ్ళు ఆ పాకలో కూర్చొని సైకిలుకువేసే ఇంజను ఏదో తయారు చేస్తున్నారని అందరూ చెప్పుకోవటం మొదలు బెట్టారు. ఈ కబురు వూరంతా ప్రాకిపోయింది. అసలుసంగతి ఎవరికీ తెలియదు. కాథరిన్ ఈ కట్టుకథ అల్లి అందరికి చెప్పి వుంటుంది. ఇంజను తయారు కావస్తోంది. ఇటీవల విల్బర్ వాళ్ళకి మరొక తోడు దొరికాడు. చార్లీ టైలర్ అనే మెకానిక్ వీళ్ళకు తోడయ్యాడు. ఇతను చాల నమ్మకమయినవాడు. వాళ్ళిద్దరూ పాకలో పనిచేసుకుంటుంటే ఈ చార్లీ అనే అతను షాపులో వుండేవాడు. రాత్రిపూట ఇతనుకూడా వాళ్ళకి సహాయ పడేవాడు. చార్లి-కాథరిన్ వీళ్ళిద్దరిని మాత్రమే వాళ్ళు పాకలోకి రానిచ్చేవాళ్ళు.

తేలికగానే వాళ్ళు ఇంజను పూర్తిచేయ గలిగారు. అయితే ఆ ఇంజను బరువులేకుండా వుండేలాగా చేయటం ఎలాగా అనేదే కష్టమయినపని. ఇంజన్ చుట్టూవుండే పెట్టె పోత యినుముతో తయారు చేస్తారు. అంచేత చాల బరు వుంటుంది.

'మనం ఇది అల్యూమినంతో చేస్తే చాల తేలికగా వుంటుందిగా' ఆర్వికి ఈ ఆలోచన తట్టింది.





'అది ఆగుతుందో లేదో? గట్టిగా వుంటుందా అని?' విల్బర్ అనుమానం వెళ్ళబుచ్చాడు.

'అయినా ప్రయత్నంచేసే చూద్దాం' అన్నాడు ఆర్వీ. చేసి చూచారు. తేలికగానూ, గట్టిగానూ కూడవుంది. ఈ ఇంజనుకి

నాలుగు సిలెండర్లు వున్నాయి. ఇది ఎనిమిది గుర్రాలశక్తి గలది. (మొన్నటి ప్రపంచయుద్ధంలో 1500 గుర్రాలశక్తిగల ఇంజన్లుగల విమానాలుకూడా తయారుచేశారు) ఈ రోజుల్లో గూడా ఇంజనుశక్తిని గుర్రంశక్తితోనే పోల్చిచెబుతుంటారు. ఈ ప్రపంచంలో ఇన్ని మార్పులు వచ్చినా ఈ విషయంలో మార్పురాలేదు. పూర్వకాలంలో ఒక్కొక్క-గుర్రం ఎంత బరువులాగగలదో ప్రతిరైతు(యిరోపా,అమెరికాదేశాల రైతులు) ఆ రోజుల్లో చెప్పగలిగే వారు. ఇంజన్లు తయారుచేసేవాళ్ళు 'ఈ ఇంజను నాలుగు గుర్రాలులాగినంత బరువులాగుతుంది' అని చెబుతుండే వాళ్ళు. ఇప్పుడుకూడా అంతే. ఒక యింజనుకు వెయ్యిగుర్రాలశక్తి వుందంటే ఆ ఇంజను వెయ్యిగుర్రాలు ఒకే సారిగా లాగినంత బరువు లాగ గలదని అర్థం.

'విల్బర్ ఆర్విల్‌లు వాళ్ళ ఇంజను బరువు రెండువందల పౌనులకు మించివుండకుండా తయారుచేశారు. అది తయారయిన తరువాత వాళ్ళ వద్దవున్న తేలికకొయ్య (Spruce)తో రెండు ప్రొఫెల్లర్లు తయారుచేశారు.

'అప్పుడు నాన్న మనకొక బొమ్మ తెచ్చిపెట్టారు-జ్ఞాపకం వుందా?' ఆర్విల్ అడిగాడు.

'హెలికాప్టర్ గదూ? అవును. ఇదీ అలానేవుంటది. కాకపోతే కొంచెంపెద్దది-అంతే' విల్బర్ నవ్వుతూ అన్నాడు.

'అవును.నాకూ జ్ఞాపకంవుంది. అది ఒక చెట్టుకొమ్మల్లో ఇరుక్కుని నుగ్గు నుగ్గయి పోయింది కదూ?' కాథరిన్ అన్నది.

'కిట్టిహాక్‌లో చెట్లులేవని తెలుసా?' విల్బర్ అన్నాడు.

'అక్కడేగా దీన్ని ఎగరవేసేది?' ఆర్వి అన్నాడు.

# ఎగిరే విమానం

కిట్టిహాక్‌లో పెద్ద మార్పు ఏమీలేదు. పేట్ మాత్రం కొంచెం పెద్ద వాడయ్యాడు. అతనికి వెనుకటికంటే పని ఏమీ పెరగలేదు. అక్కడొక పాక వేశారు. అప్పుడప్పుడూ వచ్చే గాలిదుమారాలకి గ్లయిడర్ పాడయిపోకుండా దాచుకోటానికి ఈ పాకవేశారు. ఇది వేసుకోటానికి పేట్ కూడా సాయపడ్డాడు. రోజూ వీళ్ళకు కట్టెలు కూడా తెచ్చిపెడుతూ వుండేవాడు. రోజు కొక డాలరు అతనికి ఇచ్చేవాళ్ళు.

పగలంతా ఆ గ్లయిడర్ వద్దనే ఇద్దరూ పనిచేస్తూ వుండే వాళ్ళు. ఇది చూడటానికి విచిత్రంగా వుంది. అక్కడ ప్రమాద రక్షణ ఆఫీసులోవాళ్లు వచ్చి ఇదిచూచి 'బలే బాగుంది' అన్నట్టు తలవూపుతుంటూ వెళ్ళేవాళ్ళు.

'నిజంగా ఇది ఎగురుతుందండీ?' ఒక అతను విల్బర్‌ని అడిగాడు కూడా.

'ఎగరాలి మరి-చూద్దాం!' అన్నాడు.

'దీన్ని ఎన్నాళ్ళనుంచి తయారు చేస్తున్నారండీ?' మరొక అతను అడిగాడు.

'పుట్టినప్పటినుంచి మా కిదే పని' అన్నాడు ఆర్విల్.

అప్పట్లో దానిని విమానం అనేవాళ్లు కాదు. ఎగిరే మెషిన్ అనేవాళ్ళు. వాళ్లు తయారు చేసిన ఈ గ్లయిడర్‌కి చక్రాలు లేవు. జారుడు కొయ్యలాంటివి మాత్రం వుండేవి. రెండు కొయ్యపట్టాలు చేసి ఇసుకలో పెట్టారు. అక్కడినుంచే వాళ్ళ మెషిన్ ఎగరాలి. ఇంజన్ ఒకటికి నాలుగుసార్లు బాగా పరీక్షచేసి చూచారు. చాల ధ్వని వస్తూంది. ఆ శబ్దానికి గ్లయిడర్ మొత్తం కంపించి పోతోంది. అయితే క్రింద రెక్కకు వేసి బాగా బిగించారు. అంచేత విడిపోవటానికి వీలులేదు. పోదనే వాళ్ళ నమ్మకం.

'ఈ వేళ ఎగిరించి చూద్దామా ?' 1903 సంవత్సరం డిసెంబరు 17 వ తేదీనాడు ఉదయం విల్బర్ మామూలుగా అన్నాడు. అయితే ఆ తేదీకి ఇంత గొప్పతనం వస్తుందనిగాని ఈనాటి బాలలు, బాలికలు ఆతేదీని గురించి ఇంత గొప్పగా చెప్పుకుంటారనిగాని అతనికి తెలియదు. చరిత్రలో ఆ తేదీకి ఎంతో ప్రాముఖ్యం వుంది.

'ఓఁ ఈవేళే చేసిచూద్దాం' ఆర్వి అన్నాడు. పైకి శాంతంగానే వున్నారు. కాని వాళ్ళూ మనుషులేకదూ? లోపల వాళ్ళకి భయంగానే వుండివుంటుంది. ఎవరు ఎక్కాలి అనే విషయం తేల్చుకోటానికి చిత్తువేశారు. మళ్ళీ అది ఆర్వీకే వచ్చింది.

'ఈవేళ ఎగరబోతున్నా. ఈ ప్రపంచంలో గాలిలో ఎగిరే మనుషులలో నేనే మొదటివాణ్ణి కాబోతున్నాను' సంతోషంతో పొంగిపోతూ లోలోపల అనుకున్నాడు. అక్కడ ఆరోజు గ్లయిడర్ ఎగురుతుండగా చూడటానికి అంతా కలిసి అయిదుగురు మాత్రమే వున్నారు. అది నిజంగా పైకిపోతుందని వాళ్ళల్లో ఒక్కళ్ళకీ నమ్మకంలేదు. అక్కడవున్న అయిదుగురిలో ఒక పదహారేళ్ళ కుర్రాడుకూడా వున్నాడు. అతని పేరు జానీమూర్. అతనొక చేపలుపట్టే అతని కొడుకు. ఇంజను ఆడించారు. ఆర్విల్ ఎక్కి క్రింది రెక్కమీద కూర్చున్నాడు. విపరీతంగా కంపిస్తున్న గ్లయిడర్‌ని విల్బర్ సరిగ్గా వుండేట్లు చేశాడు.

'ఊఁ తయారుగా వున్నావా....ఆర్వీ?' అని విల్బర్ తమ్ముణ్ని హెచ్చరించాడు.

'ఓఁ అంతా సర్దుకున్నాలే' అని ఆర్విల్ కేకపెట్టాడు.

'ఆఁ ఇంకపోనీ ఆర్వీ,' విల్బర్ చెప్పాడు.

ఆర్వి, లివర్ వదులుచేశాడు. ప్రొఫెల్లర్ తిరగటం మొదలుపెట్టింది. గ్లయిడర్ మెల్లగా ముందుకు సాగుతోంది.... ఇంకా కొంచెం వేగాంగా....ఇంకా....ఇంకా వేగం హెచ్చింది. గ్లయిడర్ గాలిలోకి లేచింది. పది అడుగుల ఎత్తుకు పోయింది. ఎగురుతూవుంది. ఉన్నకొద్దీ వేగం హెచ్చుతోంది. సాధారణంగా మౌనంగా వుండే విల్బర్ కూడా ఇదిచూచి సంతోషం

పట్టలేకపోతున్నాడు. ఆర్విల్ ఎగిరిపోతున్నాడు. పంద అడు గుల దాకా ఎగిరి అందంగా క్రిందికి దిగివచ్చింది.

ఆర్విల్ సంతోషంతో పుప్పొంగి పోయిన్నాడు. 'అమ్మ! ఇంక చేయగలిగినట్టే విల్,' కంపించే గొంతుకతో ఆర్వి అన్నాడు.

'ఇక గాలిలో ఎగరవచ్చు-ఇక ఎగరవచ్చు' విల్బర్ ఆనందంతో అరిచాడు.

'నేను ఎంతసే పున్నాను పైన?' ఆర్విల్ అడిగాడు.

'పన్నెండు సెకండ్లు వున్నావు ఆర్వి. ఈసారి నేను వెళ్ళివస్తాను.'

విల్బర్ నూటడెబ్బయి అడుగుల ఎత్తుపోయి క్రిందికి తీసుకువచ్చాడు. మళ్ళీ ఆర్వీ వెళ్ళి పదిహేను సెకండ్ల తర్వాత తిరిగివచ్చాడు.

విల్బర్ మళ్ళీ వెళ్ళబోతుంటే ఆర్విల్ అతనితో 'ఎంత సేపు వుండగలవో చూడు' అన్నాడు. విల్బర్ సరేనన్నాడు. ఈసారి ఇరవై అడుగుల ఎత్తుపోయి అక్కడనుంచి పైకి పోకుండా ఆ ఎత్తే ఉండేలాగున చేశాడు. అక్కడనుంచి క్రిందికి చూస్తున్నాడు. గ్లయిడర్ అక్కడే నిలిచినట్టుగను, ఇసుకదిబ్బలు తన్నుదాటుకు పరుగెత్తుచున్నట్లునూ కనబడింది. నిజంగా ఎగ్గరటం అంటే ఇదే అనుకున్నారు. అదిచూసి అక్కడే ఎగురుతూన్న రెండు డేగలు పరుగెత్తిపోయాయి. ఇదేదో

కొత్తరకం పెద్దపక్షి అనుకొని వుంటాయి పాపం! విల్బర్ ఎని మిది వందల అడుగుల ఎత్తుకు వెళ్ళాడు. అక్కడొక పెద్ద గాలితెరవచ్చి గ్లయిడర్‌ని బలవంతంగా క్రిందకు నెట్టింది.

'ఆఁ ఈసారి 59 సెకండ్లు పైనే వున్నావు విల్' అంటూ ఆర్విౝ సంతోషంతో అరిచాడు.

"ఈసారికి మరి 59 నిముషాలు వుండొచ్చు' అంటూ విల్బర్ నవ్వాడు.

'నాన్నగారికి తంతివార్త పంపుదామా?' ఆర్విౝ అన్నాడు. గ్లయిడర్ ఎగరటం కళ్ళారాచూచిన ఆ అయిదుగురూ పరుగెత్తు కుంటూ వచ్చి వాళ్ళని పొగుడుతూ కరచాలనం చేశారు. ఇప్ప టికీ వాళ్ళ కళ్ళని వాళ్ళే నమ్మలేకపోతున్నారు. అంత బరు వుతో అంత పెద్ద గ్లయిడరు భూమిమీదనుంచి ఎగిరి పైకి పోవటం కళ్ళారాచూచారు. ఇంతకు ముందు లోకంలో ఇంకె వరూ ఎప్పుడూ ఇలాంటి వింతసంగతి చూచివుండరు.

విల్బర్, ఆర్విల్ ఇద్దరూ వాళ్ళ నాన్నకీ, కాథరిన్‌కీ తంతివార్త పంపటానికి పోస్టాఫీసుకు గబగబా వెళ్ళారు. వాళ్ళ నాన్న, చెల్లాయి ఇంటివద్ద ఈ టెలిగ్రాంచూచి పొంగిపోయారు. షాపువద్దకు వెళ్ళి చార్లీకికూడా ఈ కబురు చెప్పారు. అతను మాత్రం ఏమీ ఆశ్చర్యం కనపరచలేదు.

'వాళ్ళు అలా చేయగలరని నాకు ఇదివరకే తెలుసు' అన్నాడు తాపీగా.

ఆ తరువాత వారం రోజులకు - వాళ్ళిద్దరూ ఇల్లు చేరు కున్నారు. మేళ తాళాలతో స్వాగతం చెప్పేవాళ్లు ఎవరూలేరు. స్టేషన్‌లో పత్రికా విలేఖరు లెవరూ రాలేదు. వాళ్ళనాన్న, చెల్లాయి మాత్రమే వాళ్ళకోసం స్టేషన్‌కి వచ్చారు.

'మా గ్లయిడర్ ఎగిరింది కేట్,' ఆర్విల్ ఆనందంతో అన్నాడు.

'మీమాట ఎవరు నమ్మ బోతున్నారు?' కాథరిన్ కోపంగా అన్నది.

'ఎవరు నమ్మరంటావు కేట్?' విల్బర్ అడిగాడు.

'ఎవరా? పత్రికల వాళ్ళూ, ప్రజలూ. ఎవరో ఏమిటి మన పొరుగు వాళ్ళే నమ్మరు' అన్నది ఇంకా కోపంగా.

'మొదటేమో మేము వట్టి పిచ్చివాళ్ల మని అను కున్నారు. ఇప్పుడేమో అబద్ధాల కోరులం అను కుంటారు. అంతేగా?' ఆర్విల్ అన్నాడు.

'పోనియ్యండి బాబూ- నే నెప్పుడో చెప్పలేదూ - దేవుడు మీచేత ఏవో గొప్పపనులు చేయించ బోతున్నాడని? దైవం తలపెట్టిన దాన్నెవరూ మార్చలేరు. ఈలోకంలో మొదటగా ఎగిరే అదృష్టం దేవుడు మీకు కలిగించాడు. వాళ్లు నమ్మితుంటే మీకేం? నమ్మకపోతే మీకేం?' అన్నాడు వాళ్లనాన్న.

'నమ్మ కేం చేస్తారు. చేసి చూపించి నమ్మిస్తాం' ఆర్విల్ పట్టుదలగా అన్నాడు.

## పశువుల మైదానంలో విమానం

డేటన్‌లో టారెన్సు హాఫ్‌మన్ అనే ఆయన వున్నాడు. ఆయన ఒక బ్యాంకు అధ్యక్షుడు. ఆయనకు ఆపూరి వెలుపల 80 ఎకరాల పచ్చికబీడు వుంది. అందులో వాళ్ళ పశువులు వుంటాయి. విల్బర్, ఆర్విల్ అది తమకు వాడుకోటానికి కావాలని ఆయన్ని అడిగారు.

'సరేగాని మీరేదో ఎగిరే మెషిన్ తయారు చేస్తున్నారనుకుంటున్నారు-నిజమేనా?' అని నవ్వుతూ అడిగాడు.

'ఆఁ నిజమేనండి' అన్నాడు విల్బర్.

'ఓఁ. వుపయోగించు కోండి. మీకేమీ అభ్యంతరంలేదు. కాని మా ఆవుల్ని మాత్రం చంపేరు సుమా!' అన్నాడాయన.

ఈసారి పదహారు గుర్రాల శక్తిగల ఇంజనుతో సరికొత్త మెషిన్ తయారు చేయాలనుకున్నారు. అది చేయటానికి రాత్రింపగళ్ళు పనిచేస్తున్నారు. ఇరుగుపొరుగు వాళ్ళ నవ్వులాటలు చూచి వాళ్ళమీద అసహ్యంవేసింది. అంచేత కాథరిన్, చార్లీ తప్ప వాళ్ళు ఇంకెవరితోనూ మాట్లాడటమే మానేశారు. బజారున వెళ్లుతుంటే వీళ్ళనిచూచి ప్రతివాళ్ళు 'వీళ్ళట-ఆకాశంలో ఎగిరారట,' అని గుసగుస లాడుకొంటూ వుండేవాళ్ళు.

ఈ గుసగుసలంటే వాళ్ళకేమీ భయంలేదు. కాని వాళ్ళ ఇరుగు పొరుగువాళ్ళే వాళ్ళని అబద్ధ మాడారు అంటే వాళ్ళు సహించ లేకపోయారు.

వాళ్ళు అబద్ధాలు చెప్పరని షాన్యూటికి తెలుసు. ఆయన ఫ్రాన్సు వెళ్ళినప్పుడు పారిస్ నగరంలో ఒక పెద్దసభలో ఉప న్యాసం చెబుతూ 'కిట్టిహాక్ అనే ప్రదేశంలో రైట్ సోదరులనే వాళ్ళిద్దరూ ఎగిరే మెషిన్ మీద పైకి ఎగిరవచ్చారు' అని ఆయన చెప్పారు. ఇదివిని వాళ్ళంతా ఆశ్చర్యపడ్డారు. అందుకే ఇప్పుడు వీళ్ళనిగురించి ఫ్రాన్సుదేశంలో చాల ఎక్కువగా చెప్పుకుంటు న్నారు. ఆతరువాత వీళ్ళ గొప్పతనం గురించి జర్మని, ఇంగ్లండు దేశాలలోకూడా తెలిసిపోయింది. కాని వాళ్ళ సొంత వూళ్ళో - డేటన్‌లో - మాత్రం ఎవరూ వీరి గొప్పతనం గుర్తించలేకపోయారు.

'వీళ్ళ సైకిళ్ళ వ్యాపారం ఏమిటో అడిగేవారులేక వీళ్ళకు ఇవన్నీ ఎందుకో?' అనుకునేవాళ్ళు వూళ్ళో వాళ్ళంతా. అయితే ఆ అన్నాతమ్ముళ్ళు మాత్రం వాళ్ళననేమీ మానలేదు. కొత్త ఎగిరేమెషిన్ ఆ సమీపపు మైదానంవద్దకు తీసుకు వచ్చారు. ఆరోజు మనుషుల్ని ఎగిరించా లనుకున్నారు. అప్పుడు అక్కడ నల్పైవాళ్ళు ఎవరూవుండరు. ఈసారి కొత్త మెషిన్ గాలిలో ఇదివరకు దానికంటె చాల ఎక్కువకాలం నిలిచింది. దీనిని ఎటు కావాలంటే అటు త్రిప్పటానికి వీలుగా స్టీరింగు (చుక్కాని) కూడా వుంది. ప్రతిరోజూ ఈ మైదా

నంలో అద్భుత విషయాలు జరుగుతుండేవి. కాని ఆ మైదానంలో వుండే పశువులుదప్ప ఆవూళ్ళో వాళ్ళెవరూ అది చూడటంలేదు. కొన్నాళ్ళు అయిన తరువాత ఆర్వి ఆ మైదానం చుట్టూ మూడు చక్కర్లు కొట్టేవాడు. అంటే మూడుమైళ్ళ ప్రయాణం చేసేవాడన్నమాట.



ఒకనాడు వాళ్ళనాన్నను, చెల్లాయినీ వచ్చి చూడమని పిలిచారు. వచ్చేప్పుడు గడియారంకూడా పట్టుకురమ్మని వాళ్ళ నాన్నతో చెప్పారు.

వాళ్ళ నాన్న, కాథరిన్ ఇద్దరూ వెళ్ళారు. ఆ మెషిన్ అంతా పరికించి చూచారు.

'ఇది పైన ఎంతసేపు వుంటుందో సైముచూడండి నాన్నగారూ....ఆర్వి, ఇక ఎక్కు—' అన్నాడు విల్బర్.

ఆర్విల్ దానిలోకి ఎక్కాడు. అది కనపడకుండా పైకి పోయి కాసేపటికి మళ్ళీ తిరిగివచ్చింది. ఆర్వీ సరిగ్గా వాళ్ళ నాన్న తలపైగావచ్చి ఆయనవేపు చూచి చేయి వూపాడు. అప్పుడు మళ్ళీ ఆ మైదానంచుట్టూ ఒక చక్కర్ కొట్టి వచ్చాడు. వాళ్ళనాన్న సైము గమనిస్తూనే వున్నాడు.... పది.... ఇరవై.... ముప్ఫయి నిముషాలు అయింది.

'అబ్బ! అరగంట సేపు ఎగిరాడన్నమాట' అన్నాడు విల్బర్‌తో ఆశ్చర్యంగా. అంతలో నిదానంగా ఆర్విల్ క్రిందికి దిగి వచ్చాడు.

'ముప్ఫయి తొమ్మిది నిముషాలు గాలిలో వున్నాడు!' వాళ్ళ నాన్న అనుకున్నాడు.

'గాసొలయిన్ (విమానమున సుపయోగించే పెట్రోల్‌కు అమెరికనులు వాడుకొను పేరు) అయిపోయింది. లేకపోతే అప్పుడే దిగి వచ్చేవాణ్ని కాదు' అన్నాడు పైగా ఆర్వి .

'అలా ఎంతసేపయినా ఉండవచ్చు. అది పని చేసే టప్పుడు మీరు చూడాలని అలాచేశాం,' అన్నాడు విల్బర్.

'దీన్ని ('విమానం') 'ఏర్‌ప్లేన్' అని అంటే బావుంటుంది బాబూ' అని వాళ్ళనాన్న సలహా యిచ్చాడు.

ఆ తరువాత బిషప్ రైట్ (వాళ్ళ నాన్న) తానుచూచిన సంగతి కొంతమందితో చెప్పాడు. వాళ్లు ఆయన మాటలు నమ్మారు. అంచేత విల్బర్ వాళ్ళ మీదకూడా నమ్మకం కలుగు తున్నది. వాళ్ళని మెచ్చు కొంటున్నట్లు తెలపటానికని చాల

మంది సైకిల్ షాపు దగ్గరికి వెళ్ళారు. కాని వీళ్ళతో మాట్లా డేందుకు వాళ్లకు తీరికలేదు.

'యేం, కిట్టిహాక్ నుంచి వచ్చినప్పుడు వీళ్ళంతా ఏమయ్యారో?' విల్బర్ కోపంగా అన్నాడు.

'ఇన్నాళ్ళూ వీళ్ళు మెచ్చుకుంటేనే చేశామా ఏమిటి? ఇక ముందూ అంతే' అన్నాడు ఆర్విల్.

ఒక వారంలో డేటన్‌కి ఇద్దరు ప్రముఖవ్యక్తులు వచ్చారు. అందులో ఒకరు ఫ్రాన్సు దేశస్తుడు, మరొకరు ఇంగ్లండు దేశస్తుడు. వాళ్ళిద్దరూ విల్బర్ వాళ్ల 'విమానం' కొనాలని వచ్చారు. ఎంత పెద్ద మొత్తమయినా సరే యిచ్చి, వాటిమీద పూర్తిహక్కులు కొని తమ దేశంలో మాత్రమే విమానాలు తయారు చేసుకోవాలని ఆ ఇద్దరూ అనుకొన్నారు.

'జర్మనులు ఎప్పుడయినా దండెత్తి యుద్ధానికి వస్తే ఈ విమానాలే గనక వుంటే వీటిమీదవెళ్ళి వాళ్ళమీద బాంబులు వేసి వాళ్ళని ఓడించవచ్చు.' అని వుద్రేకంగా అన్నాడు. ఇంగ్లీషు అతనూ అలానే అన్నాడు: 'మాకూ జర్మనీవాళ్ళంటే అలానే భయంగా వుంది. మీరు ఎంత అడిగితే అంత యివ్వ టానికి తయారుగా వున్నాం' అన్నాడు.

'మరి మాదేశం సంగతో? మేం అమెరికావాళ్ళం. మేం దీనిని అమ్మటమే జరిగితే అది అమెరికా సైన్యానికి మాత్రమే అమ్ముతాం. ఇంకెవరికీ అమ్మేదిలేదు' అని విల్బర్ గట్టిగా చెప్పాడు.

'కాని-మీ సైన్యానికి విమానాలంటే ఏమంత ఇష్టంలేదు. వాళ్ళు మాకు అక్కర్లేదన్నారుగా' అన్నాడు ఫ్రెంచి అతను.

విల్బర్ కొంచెం భయపడ్డాడు. నిజమే. వాళ్ళు అమెరికా ప్రభుత్వానికి వ్రాస్తే వాళ్లకు అక్కర్లేదని సమాధానం వచ్చింది. కాని ఈ సంగతి వాళ్ళిద్దరూ ఎవరితోనూ అనలేదు. వీళ్లకెలా తెలిసిందో!

'ఏమైనా కానీయండీ-ఈ రోజు కాకపోతే రేపైనా మా దేశం సైన్యానికి విమానాలు అవసరం కావచ్చు,' అన్నాడు విల్బర్. ఇతర దేశాలనుంచి వచ్చిన వాళ్ళిద్దరూ నిరాశ జెంది సరేనని వెళ్ళిపోయారు.

'ఒకసారి మన విమానం ఎగురుతూండగా అందరికీ చూపటం అవసరం. మన ప్రభుత్వంవాళ్ళు ఇది చూచివుంటే వద్దనేవాళ్ళు కారు' అన్నాడు విల్బర్.

'సరే అలాగే చూపుదాం! అప్పుడయినా తెలుసుకుంటారేమో' ఆర్విల్ అన్నాడు.

## పేరు ప్రతిష్ఠలు

అప్పట్లో థియోడర్ రూజువెల్టు (ఫ్రాంక్లిన్ డి. రూజువెల్టు కాదు) అమెరికా దేశానికి అధ్యక్షుడుగా వున్నాడు. ఆయన కార్యశూరుడని ప్రతీతి వుండేది. అయినా ఆయన చదవటంలో కూడా చాలశ్రద్ధ చూపేవాడు. ఒకనాడు ఆయన 'సైంటిఫిక్ అమెరికన్' అనే పత్రిక చదువుతున్నాడు. అందులో విల్బర్, ఆర్వీలను గురించి, వాళ్ళ విమానం గురించీ ఒకవ్యాసం వుంది.

'వీళ్ళిద్దర్నీ పిలిపించి వాళ్ళవిమానం ఎలా ఎగురుతుందో చూపించే ఏర్పాటుచేయండి. అదేమయినా పనికివస్తుందేమో' అని తన సైనికశాఖ కార్యదర్శితో ఆయన అప్పటికప్పుడే చెప్పివేశాడు.

ఒకనాడు ఒక పెద్ద సైనికోద్యోగి డేటన్ నగరానికి వచ్చాడు. ఆయన రైట్ సోదరుల ఇంటికి వెళ్ళాడు. అమెరికా దేశాధ్యక్షులవారి అభిలాషను గౌరవించడము అవశ్యకరణీయము గదా!

'ఏమండీ- నిజంచెప్పాలంటే మా సైనికోద్యోగులకు మాత్రం ఈ విమానాలంటే నమ్మకంలేదు. కాని మమ్ములను తమతో కలసికొమ్మని అధ్యక్షులవారి ఆదేశం వచ్చింది. మరి

మీ విమానం ఎలా ఎగురుతుందో చూపటానికి మీకేమైనా అభ్యంతరమా?' అని అడిగాడు.

'చూడండి మా విమానం. మీకే తెలుస్తుంది' అని ఆర్విల్ అంటే, అవు నన్నట్లు విల్బర్ తలవూపాడు.

'సరే, అయినా ఇతరులెవరూ లేకుండావుండే ఏర్పాట్లు చేయిస్తాం లెండి' అన్నాడు ఆ కలనల్ (సైనికోద్యోగి) నవ్వుతూ.

'రహస్యం ఏముంది?' విల్బర్ అన్నాడు.

'ఒకవేళ అది సరిగా పనిచేయకపోతే.... అంటే అది ఒక.... వేళ ...నేలమీదనుంచి ఎగరకపోతే.... మిమ్మల్ని అవమాన పరచటం మాకు ఇష్టంలేదు చూడండి' అంటూ గొణిగాడు కలనల్.

'మాకు ఆ భయం ఏమీ అక్కర్లేదు. వందమంది.... వెయ్యి.... కాదు.... లక్షమందిని వచ్చి చూడమనండి. మా కా భయం ఏమాత్రం లేదులెండి' ఆర్విల్ నవ్వుతూ అన్నాడు. వర్జీనియా రాష్ట్రంలోని మేయర్ ఫోర్టువద్ద ఉన్నది పరీక్షకు నియమించిన స్థలము. ఎంతోమంది జనం గుమిగూడారు. సైన్యాన్నికూడా అక్కడికి చూడటానికి రప్పించారు. రక్షణశాఖ కార్యదర్శి (మంత్రి) కూడా అక్కడికి వచ్చారు. సైనికశాఖ లోని పెద్దవుద్యోగులు డజనుమందిదాకా వచ్చారు. ఇక పత్రికా ప్రతినిధులు యాభయిమందికి పైగావచ్చారు. నిజానికి వాళ్ళల్లో ఒక్కరికికూడా ఆ వింత విమానం చూస్తుంటే అది ఎగురుతుం

డన్న నమ్మకంలేదు. ఆర్విల్ ఎక్కి పైకివెళ్ళిపోయి ఒక గంట సేపటివరకు అక్కడే చక్కర్లు కొడుతున్నాడు. అతను నేల మీదికి రాగానే అక్కడ చేరిన జనం అంతా ఉత్సాహంతో పొంగిపోయారు. వాళ్ళని ఆపటానికి వీల్లేకుండాపోయింది. మూడు నక్షత్రాలు ధరించే పెద్ద ఆఫీసర్లుసైతం ఆ అన్నా తమ్ముళ్ళను చూడటానికి ఎగబడ్డారు.

'నన్నుకూడా అందులో ఎక్కించుకు వెడతారా? మీరు అడిగినంత డబ్బుయిస్తా' అన్నాడు ఓ యువక ఆఫీసరు. అతని పేరు లెఫ్టినెంట్ ఫ్రెడ్‌లామ్. ఆర్విల్ అతనివేపు చూశాడు. చాలా హుషారుగా కనుపించాడు.

'రండి. ఎక్కండి. నా వెనుక నన్ను పట్టుకుని కూర్చోండి. కొంచెం ఆ జనాన్ని తొలగిస్తారాండీ?' అన్నాడు ఆర్విల్.

జనం వెనక్కు విరగబడ్డారు. ఆర్విల్ అతన్నికూడా ఎక్కించుకొని అవలీలగా ఎగిరిపోయాడు. ఆ మైదానం చుట్టూ మూడుసార్లు చక్కర్లుకొట్టి తరువాత దిగివచ్చాడు. ఈసారి జనం నిజంగా పిచ్చివాళ్ళయి పోయారు. ఏదో అద్భుతమైన ఇంద్రజాలం జరిగినట్లుంది. సైనికోద్యోగులు ఆలోచనలో పడ్డారు. ఈ విమానం పైకెగిరాక 180 పౌనుల బరువును అవలీలగా మోస్తుంది. అంటే 180 పౌనుల బరువు వుండే బాంబును అది మోయగల దన్నమాట. కాబట్టి దీనిలో రెండు మూడు బాంబులు తీసుకపోవచ్చు.

'ఈ విమానం హక్కులు మీరు ఏదేశం వాళ్ళకయినా అమ్ముకొన్నారా?' ఒక జనరల్ (పెద్దవుద్యోగి) అడిగాడు.

'మేమూ అమెరికనులమే జనరల్!' తాపీగా అన్నాడు ఆర్విల్.

ఈమాట అనగానే జనరల్ సంతోషపడి అతనితో కరచాలనంచేసి 'రేపు రక్షణశాఖ కార్యదర్శిగారిని చూడటానికి రాగలరా?' అని అడిగాడు.

సరే నన్నట్టు ఆ అన్నా తమ్ముళ్ళు ఇద్దరూ తలలు వూపారు.

ఆ మరునాడు వుదయాన్న లేచేప్పటికే వాళ్ళిద్దరి పేర్లు దేశంలో మ్రోగిపోతున్నాయి. ప్రతి వార్తాపత్రికలో ప్రధాన శీర్షికక్రింద వీళ్ళ విమానం ఎగిరినవార్త ప్రకటించబడింది. అప్పుడు వాళ్ళు ప్రపంచంలోకెల్లా గొప్పవాళ్ళు అయ్యారు. వీళ్ళు రక్షణశాఖ కార్యదర్శిని చూడటానికి వెడుతుంటే బయట వేలాది జనం గుమిగూడి వాళ్ళని అదేపనిగా చూస్తున్నారు.

'మీరు చాల గొప్పపని సాధించారు అబ్బాయిలూ! చరిత్రలో మొదటిసారిగా ఎగిరిన వాళ్ళు మీరే!' అంటూ కరచాలనం చేశాడు.

'సరేగాని నిన్న చూపిన దానికంటే పెద్దవిమానాలు తయారు చేయగలరా?' అని మళ్ళీ ఆయన అడిగాడు.

'దాని దేముందండీ. పెద్ద విమానం చేస్తే ఎక్కువబరువు

మోస్తుంది. దాని శక్తి నిబట్టి వుంటుంది అంతే. ఇంతకంటే పెద్దవైనా చేయొచ్చు.' అన్నాడు ఆర్విల్.

'కావలసిన సామాగ్రి వుంటే వంటఇంట్లో బల్లను కూడా ఎగిరేట్లు చేస్తాం' అన్నాడు విల్బర్.

'అవును. మీరు అంతటివాళ్లే. మన సైన్యానికి పెద్ద విమానాలు కావాలి. తయారు చేస్తారా ?' అని అడిగాడు.

'చేస్తాం- చేయకేం- చేయగలం-' ఆర్వి అన్నాడు.

'చేయకేం- బాగానే చేయగలం. కానీ....చెప్పటానికి నోరురాదు.... మావద్ద డబ్బు లేదండీ- మాదగ్గరవున్న డబ్బు అంతా నిన్న మీరుచూచిన ఆ విమానం చేయటానికే ఖర్చు అయిపోయిందండీ' అన్నాడు విల్బర్.

ఆయన ఈమాట విని నవ్వాడు.

'ఓం. ఇకడబ్బు ఆలోచన మీ కవసరం లేదు. మీకెంత కావాలంటే అంత మేం ముందుగానే ఇస్తాం. మరి గంటకు నలభయిమైళ్ళు వేగంతో పోయే విమానం చేస్తారా ?' అన్నాడు రక్షణశాఖ కార్యదర్శి.

'ఒక నలభయ్యేమిటండీ, ఎంతకావాలంటే అంతవేగం పోయేట్లు చేయగలం.' అన్నాడు ఆర్విల్.

'ఏమండీ. అవి ఇక్కడే తయరు చేయాలా; మా వూరు వెళ్ళి అక్కడ తయారుచేసి పంపవచ్చా ?' విల్బర్ అడిగాడు.

'మీ యిష్టం. ఎక్కడయినా సరే.... ఎప్పుడు వెళ్ళదలిచారేమిటి ?' అని అడిగాడు కార్యదర్శి.

'ఈరోజు రాత్రికేనండి' విల్బర్ అన్నాడు.

అయితే వెళ్ళేలోపుగా మా విందుకు వస్తారు గదూ ? మనదేశ అధ్యక్షులవారు ఈరోజు మీకు విందు చేయగోరారు. మీకేం అభ్యంతరంలేదుగా !' అన్నాడు రక్షణశాఖ కార్యదర్శి.

విల్బర్ ఆర్విల్‌వంక చూచాడు. ఆర్విల్ విల్బర్‌వేపు చూచి 'సరే అలానే వెడదాం' అన్నాడు అదొకరకంగా.

విమానం అనే నూతన సౌకర్యాన్ని ఈ ప్రపంచానికి ప్రసాదించిన ఆ అన్నాతమ్ముళ్లిద్దరూ చేయిచేయీ పట్టుకొని అక్కడినుంచి బయటికి నడిచారు.







# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA119B144 |
| పుస్తకం పేరు | విమానం కథ |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 177 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Rehana |
| పేజీలు విడదీసినది | Rehana |
| స్కాన్ చేసినది | Aruna |
| పరీక్ష చేసినది | PRATHYUSHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | |